# శ్రీ చాముండేశ్వరీ మధుర స్తవము

(విశేషభావార్థసహితము)

రచన: 'గీరసజ్జ' మాధవపెద్ది చినవేంకన్న శాస్త్రి
M.A.;B.o.L

## ‘శ్రీహరి ఉవాచ’

నవరసాలొలికించు ‘చండీశ్వరీ అమ్మవారి’ అపురూప సుస్వరూపాన్ని, తనదు సగుణ, నిర్గుణ రూపేణా విశిష్ట షాడ్గుణ్య రాశిని, తనదు సందర్భోచిత సాకార,నిరాకారావిష్కరణా తత్త్వాన్ని, పర, అపర సాక్షాత్కారాన్ని, భక్త వాత్సల్యాన్ని, అపార కరుణా కటాక్షానుగ్రహాన్ని, శిష్టరక్షణ దుష్టరక్షణా రీతులలో అమ్మవారు అవలంభించెడి అవతరణా వైనాన్ని, సృష్టి ,స్థితి, లయలలో తనదు మమైకమైన తీరును, భక్తి తత్త్వపు పరమార్థాన్ని, శుద్ధచైతన్య వైశిష్ట్యతను, ‘శేషాశేషీ, శక్తాశక్తి’ భావముల పరమత్వాంతర్యమును,మోక్షానికి,కైవల్యానికిగల సూక్ష్మ తారతమ్యముల వివరణను, అర్ధనారీశ్వర తత్త్వంపు రహస్య పరమార్థాన్ని **,ఆత్మానాత్మల బాంధవ్యాన్ని, ఆత్మ, పరమాత్మల స్నిగ్ధత్వాన్ని, అమ్మవారి అమేయు తత్త్వాన్ని, మూర్తిమత్వాన్ని ఆత్మీకరించుకోగలిగే శుద్ధభక్త్యావేశాన్ని, అనంతాలనందుకోగలిగే పరిపూర్ణభక్తి వైశిష్ట్యతను, ‘పూజ, నోము, వ్రతాది సంప్రదాయక, సంకల్పపూరిత, ఆరాధనా ప్రక్రియలను, వాటి ఆవశ్యకతను,దేవి సేవనా రీతులను, కఠోర నియమాలను’, ఆధిదైవిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మికతల అనంత సూ**క్ష్మ తత్త్వాన్ని, అమ్మవారి సర్వస్వాన్ని, సమస్త భావజాలాన్ని, సకల రూపములలో, రమ్యాతి రమ్యమైన ‘పద్య, శ్లోకాది విలక్షణాభరిత రీతులలో స్తవ, స్తోత్ర రూపేణా ఆవిష్కరించిన గురువుగారిఅద్భుత పాండిత్యశైలికి,కవితాధారకు,వాగ్దేవీ ధారణకు,వ్యక్తిగతముగాను,అంతటి మహానుభావునికి పుణ్యవశాత్తు శిష్య పరమాణువునైన నా మహద్భాగ్యానికినీ, పులకరిస్తూ గర్వపడుతూ, ఆ కవన పులకరింపులో తన్మయించి, తనివితీరా వారి విరచిత ‘చాముండీశ్వర మధురస్తవ రసానుభూతిలో తడిసి, ఆ నివేదిత భక్తిని ఆత్మ నిండుగా గ్రోలి, అమ్మవారి అనుగ్రహముచే మా గురువుగారు బ్రహ్మశ్రీ మాధవపెద్ది చినవేంకన్న శాస్త్రి **గారి అద్భుత ధారణాధారను, అన్యభాషా భక్తశిఖామణులకు కూడా అందించి, మన హైందవ సుగంధాన్ని, మెదక్ జిల్లా జోగిపేట్**

**మండలములో  చిటుకూరు గ్రామమున దివ్యముగా వెలసిన శ్రీ చాముండేశ్వరీ అమ్మవారి మహాత్మ్యాన్ని అందరికీ పంచవలెననెడి కొద్దిపాటి స్వార్ధంతో, ఈ ప్రాపంచిక ఘటనాఘటన జగత్తులో అన్నీ అమ్మవారు తలపెట్టు సంఘటలేగాని యాధృచ్ఛికాలకు స్థానములేదు గనుక, నా ఈ యత్నము కూడా సదరు అమ్మవారి తీర్మానమేననియెంచి ఈ అపురూప స్తోత్ర గ్రంధరాజమును ఆంగ్లీకము చేయనెంచి, సహృదయులైన మా గురువుగారి శిష్య వాత్సల్యపూరిత అనుజ్ఞతో**
ఆంగ్లీకరించిన నేపథ్యములో, విజ్ఞులు దోషములున్న క్షమించగలరని ఆశిస్తూ, ఈ భక్తికృతిని గురువుగారు చాముండేశ్వరీ అమ్మవారికి సమర్పించెడి ఈ ప్రశస్థ మంగళమయ సమయాన  గురువుగారి పాదములకు నమస్కరిస్తూ, తల్లి శ్రీ చాముండేశ్వరీ దేవి అమ్మవారిని మనసా వాచా స్మరిస్తూ, ఆ తల్లి పవిత్ర పాదపద్మలకు శిరసు వంచి మ్రొక్కుచూ, ఈ విశిష్ట భక్తిగ్రంధాన్ని పుస్తకరూపములోనికి తేవడానికి అన్ని ప్రయాసలను భరించిన సహజకవి శ్రీ అయ్యగారి సూర్యనారాయణమూర్తి గారు వారి శ్రీమతి అయ్యగారి రాజరాజేశ్వరి గారికి శ్రీ చాముండేశ్వరీ దేవి అమ్మవారి అనుగ్రహము సర్వవేళలా ఉండగలదని భావిస్తూ.......

సర్వేజనా స్సుఖినోభవంతు:

స్వస్తి

శ్రీహరి ప్లావుళ్ళ

# శ్రీచాముండేశ్వరీ మధురస్తవము

## (విశేషభావార్థము)

1. కం ॥ చిటుకుల జనపద గృహిణివి,

పటుతర భుజములు గలుగగ పదునెనిమిదియున్ ।

చటులతరరిపుల దునుమగ–

కటుతర శరధనువులు నిరుకరముల నిడుచున్ !

(భావార్థం :–ఓ చాముండేశ్వరీ ! నీవు చిటుకుల అను పేరుగల గ్రామమున గల ప్రతిగృహిణికి ప్రతిరూపమైన గృహిణివి. బలమైన పదునెనిమిది భుజములు గలదానివి.అందు రెండుభుజములందు(కరములందు) దుర్మార్గులైన శత్రువులను నాశనము చేయగల బాణము ధనుస్సులు ధరించి సుందరవిగ్రహరూపమున వెలిసి యున్నావు.)

(Meanig :-Hey! CHAAMUNDEE, the Supreme Deity, You are the sanctimonious-symbol of every homemaker, the inhabitant of the village CHITUKULA. Moreover, you possess eighteen potent shoulders and out of which two arms forever hold the arrow and the bow, to exterminate the wicked foes, thus you manifest yourself in the very village quite elegantly.

2. కం ॥ మిగిలిన షోడశకరముల

తగు శస్త్రాస్త్రములు దాల్చి దనుజుల దునుమన్,

నగవులు మొగమున వెలుగగ

జగములు గాతువు సతతము జగదీశ్వరివై !

(భావార్థం :–మిగిలిన పదునారు కరములందు నానావిధ దనుజులను, జనులకు హానిచేయువారలను సంహరించుటకు దగిన శస్త్రాస్త్రములను

ధరించి,శత్రువులను అనాయాసముగ నశింపజేసి, మోమున చిరునగవులు చిందుచుండగా నెల్లపుడు లోకములను గాచెడు ప్రయత్నమున జగదీశ్వరివై వెలుంగుచున్నావు.)

**(Meanig :-Having worn unique and divine-weaponry in the rest of sixteen shoulders to destroy easily and assiduously many a sects of ASURAS (the evil powers) and those who ever try to harm the very common folk intentionally, while showering smiles along and atop from your very glowing face quite efficaciously, you are shining with effulgence as JAGADEESWARI, the empress of the universe, in the sincere Endeavour of protecting all the worlds. )**

3. కం ॥ నల్లని శాలగ్రామము
నల్లన నాధారముగొని, అమ్మవు వెలయన్
మల్లెలు మొల్లలు జాజులు
కొల్లలు చేమంతులుంచి కొల్తురు భక్తుల్ !

(భావార్థం :–నల్లని శాలగ్రామశిలను నాధారముగాగొని చెక్కిన శిల్పమున నీ రూపమును నిల్పి, అమ్మవై వెలియగా–నీయందలి భక్తిప్రపత్తులతో నానా ప్రాంతములందలి భక్తులు మల్లెలు,మొల్లలు,జాజులు,చేమంతులు తెచ్చి నిన్ను నిత్యము పూజింతురు.)

**(Meanig :-When you kindly manifest yourself having imprinted your divine figurine in the chiseled idol carved out of the black 'SALAGRAMA' stone, the devotee-folk from different regions in utmost dedication, devotion and faith in you, are worshipping you eternally with jasmines, chrysanthemums, wild jasmines and the great flowering jasmines etc.)**

4. కం ॥ ఆజానుబాహు దేహము

శ్రీజీవంబుట్టిపడుచు చిందులు వేయన్

ఈ జోగిపేట వెలిసితి

వీ జీవాళిని మనుపగ నీశ్వరి ! తారా !

(భావార్థం :-లోకములను గాపాడెడి ఓ తారాదేవీ ! జోగిపేట మండలమునగల చిటుకుల ప్రాంతమున ప్రతిష్ఠితమైన నీ విగ్రహ పరిమాణము ఆజానుబాహు దేహముగలది. ఆ విగ్రహమునందు ఆపాదతలమస్తకమున దివ్యజీవచైతన్యము ఉట్టిపడుచు నలుదిక్కులు చిందించుచున్నది. ఇచటి జీవరాశిని నిత్యము కాపాడుటకు నీవిచట చాముండీశ్వరివై వెలిసితివి.)

(Meanig :-Oh! TAARAA DEVI! The protector of all the worlds! The idol that's installed in devotion in the region of CHITUKULA is as big as six feet in height touching the hands of you your very knees. The divine liveliness of you atop from the bottom of the idol conspicuously appears in piety and pervading it all the sides. In order to protect the life-stock of here evermore, You have manifested yourself as the Deity CHAMUNDESWARY! )

5. కం ॥ అష్టాదశభుజి ! చండీ !

అష్టోత్తర శత సమాఖ్యలను నిను పూజల్

స్పష్టంబుగ చేసి -తలను

తుష్టిగ నుంచగ పదముల-తోషిణి వౌదే !

(భావార్థం :-ఈ మందిరమందు నిత్యము జరుగు పూజావిశేషమేమనగా:- అస్సాంరాష్ట్రమందలి గౌహతినగరమందలి కామరూపిణీదేవి మందిరమందు జరుగు పూజావిధానమున నిష్ణాతులైన పూజారులకడ సుశిక్షితులైన పూజారులు ఇక్కడ నిత్యము పూజలు నల్పుచున్నారు.

శాక్తేయపూజావిధానమున అద్భుతముగా ఇక్కడ పూజ జరుగును. హారిద్రా కుంకుమార్చన (పసుపుకుంకుమలతో పూజ) అష్టోత్తరనామములతో విశేషముగా చేయబడును. తరువాత భక్తుడు అమ్మవారి పాదములపై తన తలవంచి మనస్సులోని కోర్కెను అమ్మవారికి నివేదించి కోరుకొనవలెను. ఈ పద్ధతి ఇతర దేవాలయాలలో చాల అరుదుగా కనిపించును. అలా కోరినందున అమ్మవారు చాల సంతోషించి భక్తుని కోర్కెలు తీర్చునని ప్రఖ్యాతి వడసినది.)

**(Meanig :-The specialty of the regular POOJA in this pious temple is :-**

**" The priests who have been well-trained up in the hands of the priests who are adept in the worshipping method of KAAMARUPINI DEVI at her sanctum-sanctorum in GOWHATHI (Assam).**

**" HARIDRA KUMKUMARCHANA (offering turmeric and vermillion) with the chanting of ASTOTHTHARA SATANAMAS (108 precious names/ epithets), is performed in utmost devotion. Later, bowing his head, the devotee, to the very pious feet of MAATHA, has to offer her/ his wish and wishes on. This method/system of practice is rarely seen in other temples.**

**" CHAAMUNDI is thus well-reputed for her quenching wishes, being contended when devotee requests her bowing to her holy-feet. )**

6. కం ॥ మదిలో గోరిన కోర్కులు
పదపడి తీర్తువట తల్లి ! పదిలముగా –నో
నదమల చాముండేశ్వరి !
హృదిలో సతతము తలతుము హ్రీంకారేశీ !

(భావార్థం :–చాముండేశ్వరి సాక్షాత్ దుర్గాసప్తశతియందు కీర్తింపబడిన

దుర్గాదేవి యొక్క ప్రతిరూపముగా స్తుతింపబడుచున్నది. ఈదేవి నవార్ణమందల్లి 'హ్రీం కారరూపిణి'గా వర్ణింపబడుచున్నది. సమస్తదేవతలు తమతమ శక్తులు రాశీభూతము చేయగా అందుండి ఉద్భవించిన శక్తిగనుక 'హ్రీంకారేశీ' అని సంబోధింపబడినది. స్వచ్ఛమైన మనస్సుతో భక్తులు కోర్కెలను నివేదింపగా నిర్మలమైన హృదయముతో ఆ కోర్కెలనన్నిటిని నెరవేర్చుచున్నది.)

**(Meaning:-CHAAMUNDESWARI is being extolled as the original replica of DURGADEVI who's eulogized in the Holy Scripture, DURGA SAPTA SATHI. This Deity is described is described as the form of the seed-syllable HREEM in the holy Hymn called NAVAARNHA. And as She is the form of energy who has emerged from the pile of accumulated-potencies of the assemblage of in-numerous multitudes of respective Gods and Deities, she is addressed HREEMKAARESWARI, the sovereign of the seed-syllable HREEM. She is, with Her pious heart, fulfilling all the desires of all the devotees when they are consecrated to Her with their serene hearts.**

7. కం ॥ బగళను, ప్రత్యంగిరనున్,
మిగులుగ వారాహిని, తమ మేనున, చాముం
డి, గరిమను, జోగుళాంబను,
నగుమోమున దాల్చితివౌకా ! నాట్యేశ్వరివై !

(**భావార్థం** :-చిటుకుల గ్రామమున చాముండేశ్వరిగా ప్రతిష్ఠితమైన దేవి వాస్తవానికి బగళ,ప్రత్యంగిర,వారాహి,జోగుళాంబ,లలిత రాజరాజేశ్వరి ఇత్యాది బహురూపములలో ప్రత్యక్షమైన దుర్గాదేవియొక్క రూపాంతరములే. నిత్యము నగుమోముతో కనిపించెడు నటరాజమూర్తి యొక్క దేవేరియే.)

**(Meanig :-The deity, who's installed at the village of CHITUKULA as CHAAMUNDESWARY is in fact the form of DURGADEVI who appears as "BAGALA, PRATYAMGIRA, VAARAAHI, JOGULAAMBA, LALITHA RAAJARAAJESWARI AND SO FORTH..," And she is none other than better-half or consort of Lord NATARAJA MURTHY who always appear with smiling face.)**

**8. కం ॥ నీలో నిలువగ దివిజులు**
**త్రైలోక్యవ్యాప్త శక్తి తాంత్రికరీతిన్**
**వేలారహితచ్ఛవి -మా**
**లో-లోలోపల వెలిగెదు లోకేశ్వరిగా !**

**(భావార్థం :-దుష్టరాక్షసులు పెచ్చురేగి లోకద్రోహకార్యములను చేయునప్పుడు వారిని ఎదుర్కొనుటకు కావలసిన శక్తిసామర్థ్యాలను ఒకచోటప్రోగుపోసి దుర్గాశక్తిని రూపొందించగా ఆ శక్తియే చాముండేశ్వరియని పేరొందినది. ఆ దివ్యదీప్తి అనంత తేజోరాశియై లోకేశ్వరియై మాలో లోలోపల వెలుగొందుచున్నది.**

**(Meanig :-In order to face the wicked RAKSHASAS (the evil powers) who're outrageously engaged in deceiving tasks against the universe, the celestials having piled up needful potencies and talents at a place, have created SHAKTHI form as DURGA. That very SHAKTHI form is thus well-reputed as CHAAMUNDESWARI, thus. That divine effulgence with infinite glow of light being LOKESWARI (the ruler of the worlds) is shining in the very core of us within.)**

9. కం ॥ దివ్యం బైనది కాయము
దివ్యంబైన పదునెనిమిది మహాస్త్రధరీ !
దివ్యంబౌ శక్తులొసగి
దివ్యంబుగ మము మనుపవె దివ్యాకారా !

(భావార్థం :-ఓ దివ్యాకారా ! నీకాయము దివ్యమైనది. నీవు దివ్యమైన పదునెనిమిది మహాస్త్రములను ధరించుదానవు. మాకు మా నిత్య జీవన సంగ్రామములో ఎదురయ్యే దుష్ట శక్తులను ఎదుర్కొనుటకు కావలసిన దివ్య శక్తులనిచ్చి మమ్ము సమర్థులను చేయుగా కోరుచున్నాము.)

(Meanig :-OH! THE CELESTIAL ONE! Your stature (body) is celestial. You wear eighteen sorts of unique and divine weaponry (SASTRAAS). We seek and pray to you to enable us to be fit by bestowing us with the required divine powers in order to face the wicked and evil powers. (Thus we speak from) in the regular or day to day battle of our lives.)

10. కం ॥ మంజీరానది కేగెదు-
మంజీరములు రవళింప-మాకెరిగింపన్ !
సంజెకు ముందుగ -మునుగగ-
రంజిల నడురేయి, హాయి, రాగిణి వౌచున్ !

(భావార్థం :-ఓ రాగిణీ ! నీవు ప్రతిరాత్రి నడురేయి నీమందిర సమీపముననున్న మంజీరానదిలో స్నానముచేయుటకు గర్భగుడినుండి వెలువడి నెమ్మదిగా నడుచుకొనుచు బయటకు వచ్చి మంజీరములు ఘల్లుఘల్లుమని రవళించుచుండగా నదికేగెదవని ప్రత్యక్షముగా దర్శించిన భక్తులు ప్రశంసించుచున్నారు. నిజమునకు నీవలా స్నానమాడుటకు వెళ్లుటలోని అంతరార్థమేమనగా-మాకు మా నిత్యకృత్యములను నేర్చుకొనుటకై మమ్ము మేల్కొల్పుచూ కార్యోన్ముఖులను గావించుటకై సందేశమిచ్చుచున్నావని తలంచుచున్నాము.)

**(Meanig :-OH! RAAGINI! The devotees who have witnessed You directly, thus are extolling that you come out from the very sanctum-sanctorum of Your temple in every midnight in order to bathe in the nearby river MANJIRA, while the anklets of your holy-feet go on producing tinkling sound. The profundity behind your bathing like in fact what we think so is, you thus wish to envisage us by awakening us and making us the confronters of the regular tasks towards learning our ephemeris to perform our respective daily activities)**

**11. కం ॥ శ్రీచాముండేశ్వరి వని**

**నా చిత్తము నీ పదముల నంచిత భక్తిన్**

**ఏ చింత లేక నుంచితి**

**నీ చిత్తంబైన రీతి నేలగ రావే !**

**(భావార్థం :-లోకకంటకులైన చండముండాసురులను సంహరించి జగతిని సుఖ శాంతులను ప్రతిష్ఠించి,ధర్మసంస్థాపనవొనరించిన చాముండేశ్వరివి నీవని విశ్వసించి స్థిరముగా నా చిత్తమును నీ పదయుగళపై యుంచి ప్రార్థించుచున్నాను.మాతా నీచిత్తంబైన రీతిన నన్ను గాపాడుమా !)**

**(Meanig :-Having strongly believed in faith that you are the very 'CHAAMUNDESWARI" who having killed, the wicked to the universe, the ASURAAS, CHANDAA AND MUNDAA, having installed the peace and tranquility in the universe thus reestablishing DHARMA, I am keeping my mind on the brace of your divine feet, praying to you, Oh! Divine Mother! Save me how and as you wish!)**

**12. కం ॥ బ్రతుకున నాఖరి దశలో**

**గతుకుల గతిలోన బండి గడవక నచటే**

చతికిల పడగా,నీవే

గతియంచు వేడితి నిన్ను-కావుము నన్నున్ !

(భావార్థం :-ఓ చాముండేశ్వరీ ! నాబ్రతుకున నేను చివరిదశకు చేరుకుంటిని. ఈ జీవనయానమున నా బ్రతుకుబండి చాలా కష్టమైన పరిస్థితులను ఎదుర్కొనుచు గతుకులత్రోవలో ముందుకు సాగలేక ఒకస్థితిలో అచటే చతికిలపడిపోయినది. దయామయీ ! నాబ్రతుకుబండిని ముందుకు సాగదీయగల శక్తి స్వరూపిణివి నీవేయని ఎరింగి నిన్ను శరణు వేడితిని. నీసాయమందించి ముందుకు నడిపింపుమా! )

(Meanig :-OH! CHAAMUNDESWARY! I have reached at my last stage in my very life. The vehicle of my life while facing many a plight of hardships, is failing to move further or forward, and even at one stage, it's getting squatted helplessly there itself where it has been. OH! The kind hearted! I have sought myself in your refugee; having known that you only are the embodiment of power and vigor who/that can run or move the vehicle of my life right ahead. Kindly extending your help lead me forward.)

13. కం ॥ పదునాలుగు లోకాలను

పదిలంబుగ గావగాను, పరిపంథి తెగన్

నదుమను, భువిలో వెలిసిన

సదమల చాముండి ! నీకు శతముల నతులున్ !

(భావార్థం :-ఈ సూర్య కుటుంబములోని పదునాలుగు లోకాలను సురక్షితముగా పాలించుటకు, శత్రుజాతులను నశింపజేయుటకు ఈ భూలోకమున చిటుకులలో వెలిసిన జగద్రక్షకివి నీవేయని, నిర్మల చాముండేశ్వరివని తెలిసికొని నీకు శతసహస్ర నమస్సులను భక్తితో సమర్పించుకొనుచున్నాను.)

**(Meanig :-I'm devotedly offering you lakhs and lakhs of grateful obeisances (NAMASKAARMS), having realized that you are the pious CHAAMUNDESWARI, the protector of the 'JAGATH'(The universe) who has appeared in the village CHITUKULA on the planet of the earth in order to safely 'rule and regulate' the fourteen worlds and annihilate totally all the enemies of all the worlds.)**

**14. సీ ॥ సువిశాల భువిలోన శోభాయమానమౌ**
**దేవాలయంబునన్ తేజరిల్లి**
**మంటపంబుల మధ్య ఘంటారవంబునన్**
**శిరము వంచుక ప్రదక్షణలు సేయు**
**భక్తాళి బ్రోవంగ పదునెనిమిది భుజా**
**లవెలిసి, యస్త్రాలు గవయ వెలిగి,**
**నిత్యార్చనలు సల్ప, నిత్యాన్న దానాన**
**యాత్రాళి తృప్తిలన్ సత్రమిడుచు,**
**తే.గీ ॥ రేయి నిద్రించి, తగినట్టి రీతిలోన**
**పసుపుకుంకుమ పూజల పదములొడిసి**
**పట్టి, మనసునిండుగ గోర బగళ ! నిన్ను**
**అన్ని నెరవేర్తు వందురే - ఆర్తజనులు**

**(భావార్థం :-ఓ బగళంబా ! నీవు ప్రతిష్ఠితమైయున్న దేవాలయముగల భూమి మంజీరానది సమీపమునగల సువిశాలమైన ప్రాంతమునగలదు. దేదీప్యమానముగా ప్రకాశించుచు దినదినాభివృద్ధి గలిగి భక్తజనావళిని ఆకర్షించుచున్నది. దేవాలయము లోపలిభాగమున విశాలమైన మంటపమునందు వ్రేలాడుచున్న గంటలను మ్రోయించుచు భక్తులు శిరము వంచుకొని జయజయధ్వానములు చేయుచు, నీ రూపమును అందమును, పదునెనిమిదిభుజములను స్తోత్రము చేయుచు,**

అస్త్రశస్త్రాలను పొగడుచు, నిత్యార్చనములను చేయించుకొనుచు, తృప్తిచెందుచున్నారు. మందిరయాజమాన్యము నిర్వహించు నిత్యాన్నదాన సత్రమున ప్రసాదము స్వీకరించి సంతసించుచున్నారు. దీక్షగైకొని, మందిరప్రాంగణమున నిద్రించి, పసుపు కుంకుమ పూజలు చేయించుకొని, నీ పాదములపై ప్రణమిల్లి, ప్రార్థించి, తమ కోర్కెలను నివేదించి వేడుకొనుచున్నారు. అట్టి ఆర్తజనుల కోర్కెలను నెరవేర్చుచున్నావని నిన్ను మనసార కీర్తించుచున్నారు.)

**(Meanig :-OH! BAGALAAMBA, the embodiment of multiplicities! The temple, where in you're installed in the spacious holy place, is situated nearby MANJEERA River. It's, by shining effulgently day by day, attracting the devotee-folk. The staunch devotees of you are getting contended by ringing the sacred bells hanging from the spacious MANTAPAM (porch) of your shrine, downing their heads, hailing your triumphs, admiring your stature and beauty, extolling your eighteen mighty shoulders arms, praising your divine-weaponry and getting your incessant worship performed. In addition, all the devotees having received the oblation in the form of an incessant-meal served (provided) by the responsible management of your very temple. Having taken your course of worship, having slept in the very sacred-premises of your shrine, having their worshipping been done with turmeric and vermillion, they having fallen at your holy feet and having offered their many an obeisance, are praying to you after having consecrated to you their desires.)**

15. శా ॥ ఐలావర్ఘురుల వేంకటాఖ్యరమణార్యాత్మన్ ప్రవేశింప, నీ
లీలారూపము, నేవిధాన గనెనో,లేకున్న, తానెట్లు, నీ
లీలాకారము నున్నదున్నటుల నాలేఖ్యంబు నొందింపగా

జాలున్!శిల్పముజూడనోహో!మహదాశ్చర్యంబు గల్గింపదే!

(భావార్థం :-ఓ చాముండేశ్వరీ ! నీ విగ్రహ నిర్మాణము చాల విచిత్రమైనది మరియు చాల అద్భుతమైనది సుమా! నీ మంత్రము నుపాసించి అనుష్ఠానమున నీ దివ్యరూపమును గాంచిన మహా మహితాత్ముడు బ్రహ్మశ్రీ ఐలారఝర్ఝుల వేంకటరమణ శర్మగారు ఎంత ధన్యాత్ములో గదా ! నీ దివ్యాకారము ఆయన ఆత్మలో ఎలా ప్రవేశించినదో, నీ లీలాకారమును వారు ఏ విధాన గనిరో, నీ మూర్తిని-వారు కనినట్లున్నదానిని-ఎలా చిత్రించి శిల్పికి వివరించి చూపిరో, ఆ శిల్పి ఉన్నదున్నట్లు ఎలా చెక్కి నీరూపమును శిల్పముగా మలిచినాడో ఇదంతా ఆలోచించినచో, నీ దివ్యశిల్పమును చూచినచో మహదాశ్చర్యము కల్గుచున్నది.)

(Meanig :-OH! CHAAMUNDESWARY! The holy construction of your idol is in fact quite singular indeed in nature. How divine personality is he, the great ATMAN, BRAHMASHREE IRAVAJJULA VENKATA RAMANA SHARMA GARU who has beholden your celestial stature while in deep contemplation after having observed chanting of your pious hymns. How has your celestial stature entered into 'his soul'? How has he viewed 'in Toto' every detail of your divine Mein and the personification of your pious pranks? How has he illustrated the same to the sculptor, as it has been, the way how he has witnessed you in perfection? How has the sculptor chiseled the stone and patterned the same into your divine idol, if we go on thinking so, we see your divine statue we go on getting infinitely amazed indeed.)

16. కం ॥ ప్రత్యంగిరవే కానిది

కృత్యాహారి వెటులౌదు ? కృపజూపంగా !

గత్యంతర మిక లేదని
నత్యంతాదరమున నిను నారాధింతున్ !

(భావార్థం :-ఓ చాముండేశ్వరీ !నీవు నిజముగా శత్రుసంహారివౌ ప్రత్యంగిరా దేవివే సుమా! కనుకనే కృత్యాహారివై నిన్నారాధించు భక్తులపై కృపజూపుచున్నావు. ఓ పరమేశ్వరీ నాపై కరుణజూపి, నా అంత:శత్రువులను, బహి:శత్రువును సంహరించి నన్నుద్ధరింపుము. నీవే శరణ్యవని అత్యంతాదరమున నిన్నారాధించుచున్నాను మాతా! )

**(Meanig :-Indeed! OH CHAAMUNDESWARY! You are in fact the very PRATYAMGIRA DEVI who is the slayer of the foes that's how, being the remover and annihilator of actions, bestow upon your devotees who worship you eternally. OH! PARAMESWARI! The supreme sovereign! By showing mercy upon me get my internal foes and external foes slain and thus get me reformed. Having known that you are indeed our savior I'm worshipping you with more awe and affection.)**

17. తే ॥ నీదు మూడు రూపములను నిరుపమాన
రీతి -బ్రాహ్మిని, కాళిని, శ్రీని నెదుర
నిల్పి, శక్తిత్రయను నిన్ను నిచ్చట గని
నిశ్చల మతిని ధ్యానింత్రు నిశ్చయముగ !

(భావార్థం :-ఓ మహాత్రిపురసుందరీ ! సత్త్వరజస్తమోగుణములకు అధిష్ఠాతృ దేవతలయిన మహా సరస్వతీ,మహాలక్ష్మీ, మహాకాళీ రూపములను,బ్రహ్మ విష్ణు మహేశ్వరుల శక్తులను, నీ దివ్యవిగ్రహమున కెదురుగా-నీ మందిరమున ప్రతిష్ఠించి,నీ దివ్య తత్త్వమును సంపూర్ణముగా నుపాసించు వారల సౌకర్యము కొరకు మందిర నిర్మాణము గావించినారు తల్లీ ! మంత్రానుష్ఠానమును, పారాయణమును, పూజాదికమును సమగ్రముగా నొనరించుకొనుట కిది మహా

సహాయ్యముగా నున్నది కదా ! )

**(Meanig :-OH! MAHAA THRIPURA SUNDHARI! The only Divine Beauty! The idols of MAHAA SARASWATHI (The Goddess of Speech and Wisdom), MAHAA LAXMI (The Goddess of riches and fortunes), MAHAAKAALI (The Consort of Kala (Lord Shiva)) who are authoritative deities of trio-attributes (SATVA, RAJAH STAMO) respectively, those represent the powers of BRAHMA (The Creator) VISHNU (The Sustainer) AND MAHESWARA (The Destructor), are installed in front of your very divine-idol in order to facilitate the deities who devotedly observe the divine philosophy of your pious UPAASANA (rigorous worshipping) in Toto, Oh Divine Mother thus your shrine is constructed. It has been verily quite comfortable and helpful to the devotee-folk to observe the sort of POOJA with perfection for the recital and incantation of your sacred spells.)**

**18.** కం ॥ పశ్చిమ దిక్కుగ నిలబడి,
నిశ్చలదృష్టిని కనుగొని, నీభక్తులు రా
నాశ్చర్యంబొదవ తమ-మ
నశ్చింతలు బాపుదువహో ! నతులను గొంచున్ !

(భావార్థం:-శ్రీ చాముండేశ్వరీ దేవి విగ్రహ ప్రతిష్ఠ- మందిరములో -పశ్చిమముఖముగా జరిగినది. దేవికి ఎదురుగా పైన చెప్పిన (17వ,ప) విధముగా శక్తిత్రయ విగ్రహప్రతిష్ఠ తూర్పుముఖముగా జరిగినది. ఇదొక విచిత్రమైన సన్నివేశమని చెప్పవలెను. దేవీ దర్శనార్థ మేగుదెంచు భక్తులను నిశ్చలదృష్టితో వీక్షించుచూ వారివారి మనస్సులలోని కోర్కెలను ముందుగానే తెలిసికొని వారివారి మనశ్చింత లను ఆశ్చర్యము కలుగునట్లు దూరముచేతువు గదా! తల్లీ నీకు నమశ్శతములు. )

**(Meanig :-It's verily and singularly occurred, the pious installation of SHREE CHAAMUNDESWARI'S sanctimonious idol facing to the west. As it's so alleged (as in the fifth poem) the installation of the trio-powerful attributes representing 'BRAHMA VISHNU AND MAHESWARA' facing the east. It ought to be mentioned that- it is the very rare instance in the divine nature. Indeed how elegant the very you Oh! Divine Mother, on observing your 'devotee-folk' with steadfast-glance who are rushing towards you with pious hearts with contemplated devotion' to have the very devotional DHARSHAN (the holy-sight) of you, kindheartedly, having known their desires and wishes in their hearts, you go on removing the grief of them, without even being told, quite amazingly! Verily revealed not! Oh Divine Mother! My infinite an obeisance to the very You!)**

**19.** సీ ॥ వారాహి వీవౌట వసుధను బ్రోతువు
పాడిపంటలు పెంచి ప్రజలు మనగ,
ప్రత్యంగిర వగుచు ప్రతికృత్య మొనరించి,
కృత్యముల నెరవేర్తు నిత్య మిలను,
బగళవై శత్రునాశగతిని సుఖశాంతి
వర్ధిల్లజేతు ప్రపంచమందు
చాముండిదేవివై జగతి నసురజాతి
సమయించి దివ్యత్వ మమర జేతు,

తే.గీ ॥ క్రియయు జ్ఞానేచ్ఛలను శక్తిత్రితయి చేయు
సృష్టి పోషణ లయములు–సేయ జాలు
నీదు కనుసైగ ! ఋషివంద్య ! వేదవేద్య !
సగుణమూర్తివి గాయత్రి ! త్రిగుణ దేవి !

(భావార్థం :-సకలదేవతా స్వరూపిణివైన చాముండేశ్వరీ ! నీ జగద్రక్షణ సామర్థ్యమును నేనేమని పొగడగలను ? వారాహీ రూపిణివై వసుధపై పాడిపంటలు పెంచి ప్రజల అవసరములను తీర్చుచూ లోకరక్షణము చేయుచున్నావు. ప్రత్యంగిరా రూపిణివై శత్రునాశ మొనరించి ప్రజల కృత్యములనన్నిటిని నెరవేరునట్లు చేయుచున్నావు. బగళాంబా రూపిణివై అరిషడ్వర్గమును సంహారించి ప్రజలకు సుఖశాంతులను వృద్ధిచేయుచున్నావు. స్వయముగా చాముండిదేవివై (దుర్గారూపిణి)లోక కంటకులైన రాక్షసజాతిని అంతముచేసి ప్రకృతిలో దైవత్వమునింపి ధర్మస్థాపనమ చేయుచున్నావు.జ్ఞానేచ్ఛాక్రియలను శక్తిత్రయమును అనగా సృష్టిస్థితిలయములను- నీ కనుసైగతోనే నిర్వహించుచున్నావు-కనుకనే వేదవేద్యవై,ఋషివంద్యవై, సాక్షాత్‌గాయత్రివై సగుణమూర్తివై లోకమున నిత్యపూజలందుకొనుచున్నావు మాతా ! )

(Meanig :-Hey! CHAAMUNDESWARY! The embodiment of all the Deities and Gods! How the best I could extol your talent of protecting all the universes? You, being VAARAAHI, are quenching the needs of people and protecting the world having increased cattle and husbandry along sufficient food and paddy on this very earth. You being PRATYAMGEERA, having exterminated all the foes, let and see all the tasks of people executed well. You being BAGLAAMBAA, having removed the six passions (The six evil attributes those mislead human beings viz. desire, wrath, covetousness, lust, arrogance, and envy.), are prospering people in happiness with peace. You being yourself, the very CHAAMUNDEE DEVI (The Divine form of DURGA), having exterminated the RAAKSHASAS (the evil-forces), are filling divinity in the nature establishing DHARMA (the virtuous code and order). You are ex-

ecuting successfully at your wink the Creation (SHRISHTI), The Sustenance (STHITHI) and The Destruction (LAYA) which are also called 'power-trio' (SHAKTHI THRAYA) which are called GNAANECHCHA KRIYAAS ( wisdom, inclination and action). That's why, you have been receiving incessant worshipping in this world by all, being considered VEDAVEDYA (the one to be known and learnt through Vedas only), RISHI VANDHYA (the one, always worshipped by sages), manifestly GAAYATHRI by yourself and the embodiment of all pious-attributes.)

20. కం ॥ ఎంత దయో చాముండికి !
చింతించిన వేంటనేను చేయించు పనుల్ !
సుంతైన జాప్యమొదవదు
ఇంతకు భక్తియ అవసర మీశ్వరిపైనన్ !

(భావార్థం :–చాముండేశ్వరి నిజముగా ఎంతటి కరుణామూర్తియో వర్ణింపలేము. మనస్సులో తలచినదే తడవుగా పనుల నన్నింటినీ నెరవేరచేయును. ఎంతమాత్రము జాప్యము కానీదు. కేవలము ఆ తల్లిపై భక్తియున్నచాలును. )

(Meanig :-We can't describe how merciful the deity CHAAMUNDESWARI IS! She will see all our tasks executed successfully as soon as we assume them to do, without delay and 'what we have to have' is sheer or pure devotion upon her.)

21. సీ ॥ ఒడిబియ్య మియ్యంగ నూహింప, వెంటనే
సంబారము లొకమ్మై సమకురంగ
జోగిపేటకు రాగ శుభముహూర్తము వెట్టి
చింతించుచుండంగ చిక్కు కలిగె

న్యాయమా ! చాముండి !యాతన కలిగింప
వేరొక్క సాయంబు వెతుకవలసె !
మాటతప్పినవారి యాట కట్టించెదు
భారంబు నీపైన పరిచివాము,
ఆ.వె ॥ మంచి చెడులు దీర్చు మర్యాద నీదమ్మ
నీదు భక్తి తప్పు వాదులేదు
నిన్ను చేరి సారె, నీకిచ్చినామమ్మ
ఒడిని నింపి, కాళ్ళ బడితిమమ్మ !

(భావార్థం :–ఈ కావ్య కవిదంపతులొకనాడు చిటుకులకేగి, అమ్మవారికి ఒడిబియ్యము పోసి, పూజ చేసి రావలెనని తలంచినంతనే ఆకార్యక్రమానికి కావలసిన పదార్థములన్నియు సమకూరినవి. బయలుదేరుటకు సిద్ధముకాగా అనూహ్యముగా ఆటంకమేర్పడి,వచ్చెదమనిచెప్పిన వ్యక్తి రాలేదు.ఆవ్యక్తి రాకపోవటానికి ఆటంకము కలిపించిన వ్యక్తిని గూర్చి అమ్మవారికి నివేదించి మా ప్రయాణమును సాగించమని వేడుకొని, బయలుదేరి చిటుకులకుపోయి, ఒడిబియ్యముపోసి,చీర సారెలిచ్చి పూజచేసి వచ్చినాము.మాకెవరిపైనను ద్వేషభావములేదని చెప్పి చండిమాతను వేడికొనినాము.అమ్మ అందరికీ అమ్మయే ! )

(Meanig :-One day, the couple of author of this book when wished to go to the village CHITUKULA to perform POOJA (worshipping) after having offered ODI BIYYAM (the pious portion of sacred rice taken aside to offer the deity) in the course of time, all the necessaries with needful ingredients for the divine session, were arranged completely. When we were about to commence our journey an unexpected hindrance took place. The gentleman, who had promised to come and lead us,

didn't arrive. We, after having revealed MAATHA about our difficulty and of the person who had created it (the promised gentleman), we begged Mother to help us in our task by all means. And later we reached to village CHITUKULA and offered MAATHA (The Divine Mother) our ODI BIYYAM (the promised portion of rice (enough to fill the lap) under a vow to be consecrated to the Deity as a token symbol of devotion, with CHEERA AND SAARE (SAREE with its belongings) and worshipped her soulfully. We pleaded and let her know that we didn't have any ill-feeling of rivalry with anyone in our prayer. After all it's true that mother is mother to all.)

22. శా ॥ చాముండేశ్వరి ! నీదురూపు కనగా జన్మాలు వేవేలుగా
తామే కర్మఫలాలు వేంటగొని రో తథ్యంబు తాత్పర్యమౌ
నీమోమందున చిందు చిత్కళకనన్ నిత్యంబు పుణ్యంబులున్
నామోచ్చారణ లేక కల్గున భువిన్ నాట్యేశ్వరీ ! చింతిలన్!

(భావార్థం :-శ్రీ చాముండేశ్వరి దర్శనము అంత సులభమైనది కాదు.తేలికైనది కాదు. ఎంతో పూర్వజన్మ సుకృతఫలము,దృఢవిశ్వాసము ఉండినగాని-జరుగదు. దేవీ నామస్మరణము నిత్యానుసంధానము చేసినగాని, స్వయంకృతాపరాధ పాపనాశనమైనగాని,అమ్మవారి సుందరవదనారవింద మందహాసము దర్శించుట, ఆ వదనారవిందముపై చిత్కళను వీక్షించుట ఆపై ఆనందించుట అను భాగ్యములు కలుగవు.)

(Meanig :-The DHARSHAN of CHAAMUNDESWARI is not that easy to experience. It won't take place unless we have had our good outcome form our previous births and indomitable will along. We don't get the fortune to behold the beautiful smile of The Divine Mother and

her CHITKALA (the brilliance of her eternal bliss, the lively-consciousness on her very lotus like face that emits the divine-happiness), dancing on her very face unless and until incessant utterance of DEVI'S name eternally is observed; all the sins of us get annihilated or burnt completely.)

23. కం ॥ నానా దిక్కులు నీవే !

నేనే దిక్కును దివాణ మేగతి లేకన్

నానా యాతన లొందుచు

నీనామమె దిక్కనుకొని నిను చేరితినే !

(భావార్థం :-శ్రీ చాముండేశ్వరి సర్వాంతర్యామిని. అన్నిదిక్కులు వ్యాపించి,అణువణువునా నిండి నిబిడీకృతయై ఆవరించియున్నది. అమ్మా నేను ఏ దిక్కూ దివాణములేని వానినై, గతిలేనివానినై నానాయాతనలనను భవించుచూ జీవించుచున్నాను.నీ నామమె దిక్కనుకొని నిన్నాశ్రయించి చేరినాను. నన్నుద్ధరించగలదానవు నీవే. దిక్కులేనివారికి చాముండియే దిక్కు గదా ! )

(Meanig :-SHREE CHAAMUNDESWARI is omnipresent. She having prevailed into all the directions thickly has hemmed in the minuteness from the atom ensconced. Oh! Divine Mother! I'm a directionless forlorn, leading my life with a lot of suffering like a destitute. I having believed in your holy name inevitably have taken your refugee you only can support and uphold me. Verily the deity CHAAMUNDESWARI is only the direction and destiny to all the destitute in the world.

24. కం ॥ కందాలు చిందు వేయును

అందాల తేట వెలదులు యమునాగంగల్

బందీయౌ శార్దూలము

విందుగ సీసాల నింపి వివరింప నినున్ !

(భావార్థం :-ఓ చాముండేశ్వరీ మాతా ! ఈ నీ కావ్యమునందు నీవు ప్రాయించిన వృత్తములు నానావిధమైన ఛందస్సులో సాగినవి సుమా ! చిందులు వేయుకందాలు,యమునాగంగలవలె కలిసిసాగు తేటగీతి ఆటవెలదులు, కవిత్వమనెడి బోనులో బందీయైన శార్దూలము, సీసాలలో నింపిన కవితాసారముగల సీసపద్యాలు.)

(Meanig :-OH! MAATHA CHAAMUNDESWARI! Verily the poems and verses those are initiated written by you, have undergone many a sorts of prosody with separate sort of meters in this very compilation. The dancing KANDA poems, THETAGITHI poems and ATAVELADHI poems have gone mingled like confluence of rivers YAMUNA AND GANGES. SAARDOOLA (tiger) poems have been seized in the case of poetry. And SEESAM (bottle) poems with the sap of poetry have been filled in SEESAMS (bottles). )

25. కం ॥ చంపక మత్తేభంబులు

పంపక మైనట్లు పేర్చి పద్యాలల్లన్

ఇంపుగ నుత్పల మాలలు

సొంపుగ వర్ణింప నిన్ను శోభలు గూర్చున్ !

(భావార్థం :-కవితా సుమ మాలల్లుటకు వీలైన చంపకమాల, ఉత్పలమాల వృత్తములు,అమ్మవారికీర్తిని నలుదిక్కులకు వినిపించునట్లు ఘీంకృతులు చేయు మత్తేభవృత్తము బహు సొంపుగా రచింప బడి,కూర్పబడినవి-కావ్యశోభ నినుమడించుచున్నవి.)

(Meanig :-To twine the garland of poetry with poesy flowers like CHAMPAKAMAALA (a sort of meter in poetry) and UTPALAMAALA (a sort of meter in poetry), the triumphant of MATHTHEBA (a sort of meter in po-

etry) poems, in proclamation of the Divine Mother's reputation, are letting the world heard from all the directions, are quite beautifully, having been written and compiled, are doubling the effulgence of the composition (KAAVYAM).)

26. చం ॥ చిటుకుల కేగి, నీ మృదుల శీతల పాద సరోజపూజ చే
యుటకు తలంచి, నామదిని–యోగము గల్గినగాని రాను నే
నటకని యెంచి, ఓ బగళ ! అద్భుత శక్తిని గూర్చి నాకు ని
చ్చుటకిట లోపమా యనుచు చుక్కలు జూచితి,యోగమీయవే॥

(భావార్థం :–ఇత:పూర్వము(22వ.ప)నుడివినట్లు–దేవీ దర్శనము సులభసాధ్యమైనదికాదు.చిటుకులకేగుట,అమ్మవారిపూజచేసి,ఆమె చల్లని పాదములపై శిరముంచి నమస్కరించి ప్రార్థించుట అనునవి ఎంతో పూర్వజన్మపుణ్యఫలమని అనుభవపూర్వకముగా చెప్పిన సత్యవాక్కులు.దానినే యోగము అని అందురు.అట్టియోగము త్వరగా కలిగించమని తారాదేవి రూపాంతరమును(చండిని)తలంచుకొనుచూ, ఆకసమునందలి చుక్కలను చూచుచు ("తారకలు" తారాదేవి మారురూపములు) ప్రార్థించి విన్నవించుకొనుచున్నాను.)

(**Meanig :-** As it's explained earlier (22nd poem), the DHARSHAN of DEVI is not that easy. 'Going to CHITUKULA, keeping our head at the pious feet of DEVI and praying (to her) after having worshipped her are truthful sentences and righteously said to be the consequence of one's yester-birth. And it's also called YOGAM (deserving). I'm praying to one of the other forms of TAARAA DEVI(CHANDI)to beget me that kind of YOGAM looking at the stars in the sky('THHAARAKAAS are the different forms of TAARAA DEVI). )

27. సీ ॥ పొడవాటి కురులలో పూల పొత్తులనుంచి
జడనల్లి క్రిందుగా జార విడిచి,
వెళుమైన నుదుటిపై కళలీను కుంకుమన్
ఉదయించు రవివోలె నదిమి యుంచి,
లేగౌను క్రిందుగా లేపాక్షి బొమ్మంచు
కుచ్చెళ్ళు వోసిన కోక చుట్టి
చిలుకపచ్చ రవిక–చేలాంచలముతోడ
విపులమై సరిజోడు వెల్గు లీన,
తే.గీ ॥ కళ్ళ కాటుక, తాటంక కాంతు లొనగ,
స్వర్ణకంకణ దీప్తులు వ్రాలుచుండ,
చరణ మంజీర మణికాంతి పరయుచుండ
అప్ప ! చాముండి అందమ్ము చెప్పతరమె !

(భావార్థం :–చిటుకులకేగి,అమ్మవారి అలంకారమును కళ్ళారచూచి,మనసార ఆనందించి,ఆనందముప్పొంగ ఇలా వర్ణింపబడుచున్నది;

1.అమ్మవారి కురులు చాల పొడవైనవి–వానిని చక్కగా దువ్వి,పాయలుగాదీసి, పూలపొత్తులనుంచి జడనల్లి క్రిందుగా జారవిడువగా ఆ పూలజడ కాళ్ళవరకు వ్యాపించినది.

2.విశాలమైన ఫాలభాగముపైన ఎర్రని కుంకుమబొట్టును అదిమిపెట్ట, తూర్పుదిక్కున ఉదయించు సూర్యునివలె వెలుగొందుచున్నది.

3.సన్నని నడుముక్రిందుగా–లేపాక్షి బొమ్మంచు ముద్రించిన నేతచీర కుచ్చెళ్ళు వోసి కట్ట అలంకరించగా బహు నాజూకుగా నిలిచియున్నది.

4.ఆ నేతచీరకు సరిజోడుగా చిలుకాకుపచ్చ రవిక బహుపొందికగా అమరి అందాలొలుకుచున్నది.

5.కళ్ళకు నలదిన కాటుక.చెవులకలంకరించిన దుద్దులు,చేతులకు

**తొడిగిన బంగరు కంకణములు,పాదాల మంజీర మణికాంతులు ఆ ప్రాంతమంతా శోభలీనుచుండ-అప్ప !చాముండి అందమ్ము చెప్ప తరమె!)**

**(Meanig :-After having gone to CHITUKULA, seen the décor and divine pomp of the Divine Mother eyeful and enjoyed soulful burst forth with bliss, the adornment or embellishment of the Divine Mother is being described this manner.**

**" As the very hair of MAATHA is quite a-long enough, having combed it properly and split it into needful portions, having inserted in different flowers, twined in a beautiful braid and when the braid is let lose down free, it spreads up to the legs a-long.**

**" The sectarian circlet-vermillion-mark (KUMKUMA BOTTU) set pressed on the very middle of forehead is shining like the Sun in the east.**

**" By fastening, the fore-skirts of woven-SAREE decently that's imprinted with the picture of LEPAKSHI, down the elegantly lean-waist around when is adorned, she stands quite tenderly and so delicately.**

**" The thick greenish 'parrot colored blouse, being appropriately suited well, to that woven-SAREE, is emitting out all the beauties.**

**" The eye-salve applied to eyes, the ear-ornaments adorned to the ears, the golden bracelets worn to hands and the anklets decorated to anklets while shining like diamonds all over the place. OH! APPA! CHAAMUNDEE! It is indeed impossible to describe your divine beauty and manner. )**

28. ఉ॥ ముద్దులు మూటగట్టినటు మోమున వెల్గెడు కాంతిలోన తా
సుద్దులు జెప్పునట్లు నవశోభలు చిందెడు చంద్రశేఖరుం
డొద్దిక జేర-చెంపకడ, నోరగ నవ్విన నీదు నవ్వు మా
కద్దిర త్రోవ చూపెడిది గాద ! నిరంతర దివ్య దీపికై !

(భావార్థం :-సర్వాలంకార శోభితయైన చాముండేశ్వరీ దేవిని చూచి, అద్భుతాశ్చర్యపరవశుడైన చంద్రశేఖరుడు సంతోషమున నుబ్బితబ్బిబ్బై, చండికడకేగి,ఏవో సుద్దులు చెప్పునెపమున(ముచ్చట్లు) మెల్లగా నామె బుగ్గలకు దగ్గరగా తన మోమును చేర్చెను.చండి చంద్రశేఖరుని ఉద్దేశ్యమును గ్రహించి ఓరగా నవ్వెను. ఆహా ! ఆ నవ్వే మనలనందరను నుద్ధరించునట్టి దివ్యజ్యోతి యగునుగదా !

(ముచ్చట్లు చెప్పుటకు చెవి కడకు మోమును చేర్చవలెనుగాని చెంపకడకు చేర్చుటలో చుంబనాభిలాష దాగియున్నది.అది గమనించిన చాముండి నోరగ నవ్వినది. ఆ నవ్వే మనకు దివ్యజ్యోతి).

(Meanig :-Having seen the splendidly beautified or adorned CHAAMUNDESWARI DEVI, by all means, CHANDRASEKHARA, Her Consort having been blissful at wonderful amazing, being wrapt in utmost glee, having gone to CHANDEE pretending as if he were supposed to tell some chat, He brought His face nearer to the cheeks of CHANDEE. But having understood the intention of CHANDRASEKHARA, CHANDEE smiled in ogle! Aaha! The smile itself is the only divine effulgence that reforms and upholds us in devotional-dignity. )

29. ఉ ॥ చామన ఛాయ నీయొడలు, శ్యామలవౌదువు ! నీదుమోముపై
సోమునికాంతి దీపిలగ సోమిని వౌదువు,మూడుకన్నులన్
సోమునిరాణి వౌదువని చూతురు, చేతుల గ్రంథవీణలున్
ధామముదాల్చి బ్రాహ్మివగు తారగ నెంతురు చండికేశ్వరీ !

(భావార్థం :-ఓ చాముండేశ్వరీ మాతా ! నీ శరీరచ్ఛాయ చామనచాయ-గనుక నిన్ను శ్యామలాదేవిగా ఎంచుదుము.నీ వదనముపై చంద్రకాంతి శోభించుచున్నది-కనక సోమినిగా తలంతుము.ఫాలభాగముపై మూడు కన్నులుండుట చేత ఉమాదేవిగా భావింతుము. నీ చేతులందు వీణయు, పుస్తకము ఉండుటవలన తారావారిగా గమనింతుము. ఆయా పరిస్థితులలో,సందర్భములలో నీవు వివిధదేవతా రూపములను ధరించిననూ, నీవు మా ఆరాధ్యదేవతవైన, సర్వదేవతాస్వరూపిణివైన చాముండేశ్వరివే సుమా ! )

(Meanig :-Oh! CHAAMUNDESWARI MAATHA! As you have a light complexion (a brown or straw color) of skin, we consider you as SYAAMALA DEVI. As the lighting of the Moon in shining up on Your very face, we regard You as 'SOMINI' as you have three eyes on your forehead, we feel that you are UMA DEVI. As you have harp and book in your hands, we observe you as 'TARAVARI'. Verily, though you wear/manifest deferent divine-forms of deities accordingly and as per the need and the demand of the situations, you are our venerable Goddess CHAAMUNDESWARI, the embodiment of all deities.)

30. మ ॥ దివికిన్ భూమికి బంధమేమి యనుచున్ ధీమంతులూహింప,ఆ
దివిజుల్ భూమికి నేగుదెంచి, తమదౌ దివ్యాత్మ జీవాత్మలో
గవయంజేయగ భూమి దేవతయి, స్వర్గంబిక్కడే యుందనన్
అవనీదేవత !చండి ! నీవయ మహాసాక్ష్యంబు మాకిచ్చుటన్!

(భావార్థం :-నీ మందిర నిర్మాణమును,పరిసరముల సౌందర్యమును, సమీపమున ప్రవహించు మంజీరానది సౌభాగ్యమును, సందర్శించిన మీదట ఆశ్చర్యచకితులైన ధీమంతులు ఇలా ఆలోచించసాగారు. “ ఓ

చాముండేశ్వరీ ! అసలు ఈభూమికి ఆ దేవతాలోకానికి సంబంధమేమిటి ? నీవీ ప్రాంతమున నవతరించుట ఏమిటి ?" అని-నీవు మాపైని కరుణతో మాకు తెలియజేయగా, మాకర్థమైనదేమనగా- మీదేవతా సమూహము మాపై దయతో ఈ భూమిపై కేగుదెంచి, ఈభూమిని దేవభూమినిచేసి, మీ దివ్యాత్మలను మా జీవాత్మలలో చొప్పింపజేయగా ఈ భూమిస్వర్గమైనదనియూ ఇచ్చటి జీవులు దేవతలైరనియు అవగాహన మగుచున్నదని.అనగా ఈప్రాంతము ఎంతో పవిత్రమైనదని సుస్పష్టము)

**(Meanig :-After having seen the construction of your Temple, the scenic beauty, the divine fortune of flowing river MANJEERA, the amazing affluent folk started thinking this demeanor, "Oh! CHAAMUNDESWARI! What is the relation between those divine worlds and this very Earth? And why have you manifested yourself here, in this region? When you have kindly revealed us what we have understood is- multitudes of your heavenly-beings having arrived to this Earth and having changed this land into 'the land of God', and when your divine souls have inducted into our mere souls this Earth has turned into the heaven. And the creatures of this land have become the deities. That's what we are getting comprehended. In other words, therefore, it is clear that this land is very pious." )**

31. మ ॥సురలా వేరుగలేరు-భూసురులె ! ఈ జోగ్పేట స్వర్గంబు,ఆ
వరగంగానది మంజిరా నదియ, నీపాదోదకం బాసురే !
వరవృక్షంబులు దేవతాతరులు, ఓ ప్రత్యంగిరా ! మాకికే
వరమున్ వేరుగ కావలెన్ననుచు నీపాదాలపై వేడమే !

(భావార్థం :-చిటుకుల స్వర్గతుల్యమని వర్ణింపబడినది. స్వర్గానికి చిటుకులకు-జోగిపేటతో సహా-పోలికలు ఏవనగా- (1)దేవతలు =మందిరము

**లోని పూజారులు ,(2)జోగిపేట=స్వర్గము,గంగానది=మంజీరానది,(3) అమృతము =దేవీపాదోకము, (4)కల్పవృక్షాదులు= ఇచ్చుట నున్న తరుల తాదులు, కనుక మేము స్వర్గములోనే ఉండగా, ఇక మాకు వేరే వరము కావలెనని నిన్ను కోరుట ఎందులకు? ఓ ప్రత్యంగిరాదేవి! చెపుమా ! )**

**(Meanig :- It has been described that CHITUKULA is as equivalent as the Heaven. The comparison between CHITUKULA and the Heaven along with JOGIPET is; (1) Deities- 'the priests in the Temple. (2)JOGIPET-'the Heaven'. River Ganges-river MANJEERA. (3) Ambrosia: the water made Holy by washing the pious-feet of DEVI. The 'wish-yielding trees'-the trees in CHITUKULA. So when we are already in the very Heaven itself Oh! PRATYAMGIRA, please tell us, why should we seek another boon from very you? )**

32. మ ॥ దివిలో వెల్గెడు తారలం గనగ నీ దివ్యత్వ దీపాలుగా,
భువిలో బారెడు నావగల్ గనగ నీ భోజ్యత్వ భాగ్యంబుగా,
దివికిం బెర్గిన శైలముల్ గనగ నీదేవీత్వ చిహ్నంబుగా,
అవనీక్షిప్తపు ధాతువుల్ గనగ నీ ఐశ్వర్యమై తో చెడున్ !

(భావార్థం :-ఓ సర్వశక్తి స్వరూపిణీ ! నీ సర్వాంతర్యామిత్వము మహాద్భుతమైనది గదా ! ఈ ప్రకృతిని పరిశీలించినచో అర్థము చేసికొనుటకు వీలుకలుగుచున్నది. ఆకసమున వెలుగు తారకులు నీ దివ్యశక్తిని తెలుపు దీపాలు.మహా జీవనదులు నీ భోజ్యత్వ భాగ్యాలు.మహోన్నతపర్వతాలు నీ దేవీత్వ చిహ్నాలు. భూమిలో దాగిన గనులు నీ మహదైశ్వర్య సంపదలు. ఇవన్నీ మా కొసంగుట కొరకు నీవు నీ దివ్యలోకము నుండి భూలోకమునకు తెచ్చి యుంచినావు. ఎవరి అదృష్టముకొద్దీ వారి కొసంగెదవు గదా ! )

(Meanig :-Oh! The embodiment of all the potencies! The omnipotent! Your Omni-pervasiveness is verily quite miraculous. If we observe this nature, we get possibility to understand it. The stars shining in the Sky are the lights showing your very divine-power. The perennial sacred rivers are the wealth of your providing edible-food to all the creatures. The greatest mountains are the greatest divine signs of your very divinity. The mines those are ensconced under the earth are the greatest or the wealthiest properties of you. In order to bestow them all upon us, you have brought them and kept here from the divine world of you. You verily endow them with kindness as per one's deservedness and destiny.)

33. ఉ ॥దీపము వెల్గగా తిలజ దీపిక వత్తియునుండియున్, తగన్
రూపము నల్లి నల్దెసలు రోచిలజేసెడు నీదుశక్తి ఆ
వాపము గానిచో-కళిక భాసిల గల్గున చండికా ! భువిన్ !
తోపగజేయు నీప్రకృతి తోడిది చేతన దేహధారికిన్ !

(భావార్థం :-ఓ చాముండేశ్వరీ ! దీపము వెల్గించుటకు కావలసిన వస్తువులన్నియు-అనగా ప్రమిద,తైలము,వత్తియు, ఉండినప్పటికిని-వత్తిని వెలిగించుటకు కావలసిన అగ్ని లేనిచో దీపము వెల్గదు గదా ! ఆ అగ్ని నీ రూపమై యున్నది.నీవు సహకరించినచో దీపము వెల్గి కాంతినల్దెసలు ప్రసరించి చుట్టూ ఆవరించియున్న చీకట్లను పారద్రోలి జ్ఞానజ్యోతిని జీవులందు నిల్పును. ఆ విధముగనే జీవులలో చైతన్యమును నింపి కార్యోన్ముఖులను చేసెడు శక్తివి గూడ నీవే సుమా ! )

(Meanig :-"OH! CHAAMUNDESWARI! Though we have all the things required to light a lamp, like a saucer for oil (used as a lamp), oil and wick, if, we don't have fire to light the lamp, indeed the lamp can't be lit and illumined. That fire is in fact in the form of you. If you cooperate, the lamp gets lit up and the lights spread into all the four sides and having dispelled all the darkness that's pervaded around, fix the internal illumination (enlightenment) into all the beings. In the same sort, you are indeed the potency that inclines all the beings towards doing their duties sincerely, after having filled into them, the sheer-consciousness.)

34. సీ ॥ పంచభూతంబులు, పైపైన దీపించు
గ్రహములున్ తారలున్, మహిమదోవ,
నూర్ధ్వలోకములేడు-నోలినిన్నే డధో
లోకాలు పదునాల్గు లోకములును,
లెక్కలేనన్నిటిన్ మిక్కుటముగ జేసి-
ఆటలాడించెద వమ్మ నీవు !
నీ శక్తియున్ శక్త లీశిత్వ భావంబు
బుద్ర కేవిధి నైన బోధపడదు !

తే.గీ ॥ శేషశేషులు మీకన్న శిష్టులెవరు ?
మీదు చల్లని చూపులు మాదుపైన
పితలు ప్రసరింపజేయుడు పిల్ల లనుచు
ముందు మాముందు మీరలె యుండవలయు !

(భావార్థం :–ఓ త్రిశక్తి స్వరూపిణీ ! నీవు నీ శక్తతో గూడి ఈ భువనభాండములను సృష్టించి చిత్రవిచిత్రములుగా విభజించి పరిపాలించుచున్నావు గదా మాతా ! నిర్గుణములో నుండి సగుణ ప్రపంచమును నుద్భవింపజేసినావు.పంచభూతములు మొదలుగా గాల 24 తత్త్వములు, ఊర్ధ్వలోకములేడు,అధోలోకములు ఏడు, గ్రహతారకములు,దేవాసుర జాతులు ఇలా నానావిధ ప్రకారములైన స్థావర జంగములను సృజించి,కాలావధి నేర్పాటు జేసి, కర్మ పునర్జన్మలను కల్పించి సమయింపజేయు చున్నావు.శక్తి శక్తలు మీరిరువురు విచిత్రమైన కార్యనిర్వాహకులై వర్తించుచున్నారు. శేష శేషులై, సృష్టి స్థితి లయములకు నిర్వాహకులై, మీరు బాధ్యతలను పంచుకొను విధానము మాకేమాత్రము బోధపడదు. కనుక మేము ప్రార్థించునదేమనగా మమ్ము దయతో కాపాడుడు. మీ చల్లని చూపులు మాపై ప్రసరింపజేయుడు. తలిదండ్రులై మమ్ము పోషించి, మీరే ముందుండి మా పనులు తప్పక నెరవేర్చుడు– అని నీ పాదములపై బడుచున్నాము.)

(Meanig :-"OH! The embodiment of three-potencies, you being united with your SHAKTA (In juxtaposition), you, having created all the universes (vessels) and having singularly divided them, are ruling them indeed Oh! Divine Mother! You have sustained and produced the possession of all the attributes in the form of the material or physical world from the state of the devoid of all the attributes. Having created the twenty four philosophies etc., with the five elements, the lower or netherworlds

**seven, the seven the worlds above, the heaven, the planets and stars, the races of deities and RAAKSHASAS (the evil-forces), like this all sorts of similitude, having artificially fabricated the KARMA and metempsychosis (the second birth or rebirth), setting the limit of time accordingly you are equating thus. SHAKTI AND SHAKTA, both of you, being very singular executors are behaving so divine. It can't be understood to us the method of your distribution of your responsibilities only between the very You, the Supreme Souls, being SESHA and SESHI and the directors, the executors or conductors of the creation, the sustenance and destruction. Therefore, what we pray to you is to kindly protect us. Kindly extend your cool and gracious eye-glances towards us. Being the Divine Parents of us, having nurtured and sustained us, kindly pioneer our tasks get fulfilled -praying so we are falling at your holy-feet.)**

35. **ఉ ॥ నీ కనుబొమ్మ సైగగొని నీ భువనంబులు పుట్టుచుండు నా**
**నీ కనుసైగ తోడ నటులీ పదునాల్గును గిట్టుచుండు, ఓ**
**లోకవిధాయకీ ! కనగ లూత జనింప గ్రహింప జాలునో**
**ఆకత గూడహెూ జనని ! ఆవిధి కర్తవు కర్మ వీవటే !**

**(భావార్థం :-ఓ జగన్మాతా ! జ్ఞానేచ్ఛాక్రియా స్వరూపిణీ ! నీ కనుబొమ్మ సైగతో ఈ లోకాలు పుట్టుచున్నవి. ఆ నీ కనుబొమ్మ సైగతోనే ఈ లోకాలు గిట్టుచున్నవి. అనగా నీలో నుండి ఆవిర్భవించి మరలా నీలోనే కలియుచున్నవి. ఇదొక ఊహాతీతమైన ప్రక్రియ. సాలెపురుగు తనలోనుండి గూటిని బయటకి తీసి నిర్మించగలదు. తాను నిర్మించిన గూటిని తనలోకి గ్రహించగలదు. అలా, నీవీ జగత్ సృష్టికి కర్తవు, కర్మవు అగుచు నీ లీలా విభూతులను ప్రదర్శించుచున్నావు. )**

**(Meanig :-OH! JAGNMAATHA! Mother of all the uni-**

verses! The embodiment of wisdom, wish and execution! At the very wink of your eyebrow, these universes get begotten and perished. It does mean that they get originated from you and get dissolved in very you. This is a sort of 'beyond thought of' your great execution. A spider can build its web cob, taking from its very mouth. Also it is able to grasp and imbibe its web cob again into it. In the same way, you being the subject and fate of this great creation, thus you exhibit your great sports and the divine excellence. )

36. ఉ ॥ నీలో లోకములన్నియున్ గలవనేభావంబు చిత్రంబహెూ !
ఓ లోకేశ్వరి ! నీవ ఈ జగములందున్నావనే మాట ఇం
కేలో చిత్ర విచిత్రమై మదినితోపించున్ మహాదేవిరో !
ఈ లోకాత్మ విభావనంబు మనకున్ ఏకాత్మసంధానమా !

(భావార్థం :-ఓ మహాదేవీ ! బయట కన్పించు ఈ లోకాలన్నీ నీలోనే ఉన్నాయనే భావము ఓ పట్టాన మా కర్థమయ్యే విషయముకాదు. అలానే ఈ బాహ్యప్రపంచంలో నీవు జీవులరూపమున ఉన్నావనే విషయము గూడ మాకు ఓ పట్టాన అవగాహనకాదు. అనగా పరమాత్మరూపమున నీవు జీవాత్మరూపమున మేము ఉన్నామనగా- వాస్తవముగా-ఈ పరమాత్మ జీవాత్మ సంబంధము మనకు ఏకాత్మ సంధానమన్న మాట ! పరమాత్మకు జీవాత్మకు మధ్య కర్మ సిద్ధాంతమొకటి-తెలియవలసినది-ఉన్నమాట!)

(Meanig :-OH! MAHAADEVI! It' not that easy thing to be comprehended by us that 'all the universes those are visible to us' are within you. As well it is beyond our apprehension that you remain in the form of all the creatures as the dwelling spirit in the outer-universe. It does mean that you are in the form of Supreme-soul and we are in the form of Soul; means- in reality, verily the re-

**lation between the Supreme soul and sheer soul is the compiled 'Single-soul'! What 'yet to be known' is the theory of KARMA between the Supreme Soul and Sheer Soul.)**

37. మ ॥ మదిలో మానిసికుండగా వలయు సంభావ్యంపు సౌజన్యమీ
మొదలౌ ప్రత్యుపకారమన్ గుణము లేమో లేవు, స్వార్థాదులే
తుదకున్ గుట్టలు గుట్టలై పెరగగా తుచ్ఛంపు జీవుండయెన్
బ్రదుకున్ పాపపునార్జనంబునకు తోరంబయ్యె తారావళీ !

(భావార్థం :-ఓ తారావళీ ! మనిషి మానవత్వమును పెంపొందించుకొనుటకు ప్రతిదినమును అభ్యాసము చేయవలసిన గుణములు 1.సౌజన్యము 2.ప్రత్యుపకారము మొదలైనవాటిని మరిచిపోయి కేవలము స్వార్థప్రయోజనమునే పెంచుకొనుచున్నాడు.అలా చేయుటచే పాపము మనిషి మనస్సు విషపూరితమై పోవుచున్నది. మానవత్వము నశించి దానవత్వము పెరిగిపోవుచున్నది. దోపిడీతనము ఎక్కువగుచున్నది. ఇది మంచి పరిణామము కాదు.)

(Meanig :-OH! THAARAAVALI! The infinite string of all the stars! Instead of nurturing or developing his humanity by practicing the attributes of decency in helping others with gratitude in the philanthropic manner, the human being, having forgotten them is fostering selfishness and its motto. By committing so, sins are becoming more, and his mind is getting spoilt. In the human, the humanity, being perished, the demonry or demoniacal influence (evilness) is getting grown. Dacoity or robbing nature is becoming more. This is not good result at all. )

38. ఉ ॥ ప్రేమలులేవు, బంధుతయు పేరుకు గూడ లేదు, చూపులో
తేమయు లేదు, నోటికిని తీయని మాటయులేదు, నవ్వులో
కోమలమైన మోమదియు కొంచెము గూడను చూడలేదు, తా
రేమియు గొంచుపోరనియు నెంచరు నించుక పంచమీశ్వరీ !

(భావార్థం :-ఓ పంచమీశ్వరీ ! ఇలాంటి దుష్పరిణామము వలన

మానవులలో సహజముగా నుండవలసిన గుణములు 1.ప్రేమ, 2.బంధుత,3.ఆర్ద్రదృష్టి, 4.మధురవచనములు,5.కోమల దర హాసము, 6.స్వార్థరాహిత్యము అను ఆరుగుణములు పూర్తిగా ఆవిరైపోయినవి. చివరకు పరస్పరద్వేషము,హత్యా మనస్తత్వము,ఆత్మహత్యా ప్రేరణము అభివృద్ధిచెందుతున్నాయి. ఇవి సమసమాజ జీవనానికి దోహదము చేయునా ?)

38. OH! PANCHAMESWARI! Due to these bad results, the attributes those are supposed to be naturally in the human beings, 1.love, 2.relation, 3.vision of benevolence. 4. Sweet conversation. 5. Tender smiling and 6.selflessness are completely evaporated. At the end, mutual hatred, killing tendency, suicidal tendency are developing. Are these useful to the life and life style of society?

39. ఉ ॥ కూడగబెట్టు సంపదొక కొంచెముగూడ ప్రయోజనంబొనం
గూడగజేయునా బగళ ! గుట్టలు గుట్టలుగాగ పాపవుం
గూడును గుడ్వ చేయు, మరి కూర్మికి పేర్మికి గూడిరాని-యా
బోడి ధనంబదేలకని పుణ్యపు మార్గము చూపు తారకా !

(భావార్థం :-ఓ తారకాదేవీ ! ధనసంపాదన ఎక్కువైనకొద్దీ, స్వార్థమెక్కువై, కూడబెట్టుట ఎక్కువైపోయినచో-దానగుణము తక్కువై,సహాయస్వభావము క్షీణించి పాపపూరితజీవనము మానవులకు అలవడును.ఆ పాపపు కూడు తినుటయే అలవడును. కాగా మానవులలో కూర్మి పేర్మి అంతరించిపోవును. అటువంటి పరిస్థితులలో-మానవత్వమును నాశనమొనర్చు ఆ బోడి ధనమెందులకు ? దానిపై వ్యామోహమెందులకు? పవిత్రజీవనము అలవడుటకు కావలసిన పుణ్యమార్గమును చూపించుమా ! )

**39. OH!THAARAKA DEVI! When money-earning grows in excess, selfishness being developed more, in human, the accumulation of money also remarkably grows up, and then charitable attitude in him naturally falls deficient. In addition, helping nature or philanthropy being emaciated or diminished in human beings and they get accustomed to sinful life and of its style and they get habituated to feed upon themselves that sinful food only. Moreover, love and affection perish or exhaust in human beings or no longer does it exist. In such situations, why need we have that mere-useless money that perishes the humanity? In addition, why should we be fanciful or avaricious passion-some towards such money? Please! Show us the divine-path that accommodates us to be accustomed to the sacred life.**

**40.** ఉ ॥ ఏమని వేడనే బగళ ! ఎన్ని విధంబుల నెన్నిమార్లు నీ
మోమునుజూసి, వేడజని, ముద్దులుచిందెడి శోభలీనమై
నామది నన్ను మర్చినది,నన్నును మర్చితి నేను గూడ,నా
నోముల పంట! నీకడను నూరకకోరుట వేడుటేలనే ?

(భావార్థం :- ఓ నా నోములపంటా ! చాముండేశ్వరీ ! ఎన్నో మారులు నిన్ను వేడుటకై నీ కడ కేగుదెంచితిని. నీ ముందు నిలబడి వేడుట మెదలు పెట్టుదమనుకొని నీవైపు చూడగనే, ముద్దులు చిందెడు నీ మోమును చూడగనే, ఏమని వేడదలచితినో ఆ విషయమును మరిచిపోతిని. నా మనస్సు నన్ను మర్చిపోయినది. నన్ను నేను మరిచిపోతిని నీ అందాల మోమును చూచి సర్వము మరిచి నీలో ఏకమైతిని.ఇక వేరుగ వేడుటకోరుటలు ఎందుకే ? )

**40. Oh! The harvest of my meritorious vow! CHAAMUNDESWARI! Many a times I came to you to**

**pray. As soon as I looked at your 'very beautiful face with lump of charms', after standing in front of you and about to commence my devotional appeal or entreat to the very you, I forgot what I had planned to appeal to you. My heart forgot me and I forgot me myself. I was united in you after having seen your radiant face, forgetting the whole. Why again in particular, there be praying or seeking?**

**41. శా ॥ దుర్గా ! నీదగురూపు కాళి రమయున్ తోడైన బ్రాహ్మీసతుల్**
**స్వర్గంగా త్రిసరిత్తులట్లు కలిసెన్ శక్తి త్రయంబట్లుగా**
**ఆర్తుగర్ తల్లుల బిడ్డనున్వలె నను ఆలించి పాలించుమా**
**మార్గంబీవయటంచు పంచబడితిన్ మమ్ముద్ధరింపన్ శివా !**

**(భావార్థం :–ఓ శివా ! నీ దుర్గారూపమునందు మహాకాళీ,మహాలక్ష్మీ,మహా సరస్వతీ స్వరూపములు సత్వరజస్తమో గుణాధిదేవతలు,జ్ఞానేచ్ఛాక్రియాశక్తుల సంగమము–సృష్టిస్థితిలయుల కొరకై–గంగాయమునా సరస్వతుల కలయికవలె ఏకమై త్రివేణీ సంగమమిట్లు విరాజిల్లుచున్నది. షణ్ముఖుని ,శరవణభవుని చేరదీసి,ఆవరించినట్లుగా నన్ను నీ ఒడిజేర్చి ఆలించి పాలించుమా ! ఈ కర్మభూమిలో స్వార్థజీవన మార్గములోబడి పావపు బ్రదుకు గడపుట కిష్టములేక నీ పంచబడితిని.మమ్ముద్ధరించి ఉత్తమగతులిచ్చు భారము నీదే గదా ! )**

**41. OH! SHIVAA (the consort of Lord Shiva)! In your divine form of DURGA, all forms of MAHAAKAALI (the consort of Lord Kala (epithet of Lord Shiva), MAHAA LAXMY (Goddess of prosperity and fortune), MAHAA SARASWATHI (Goddess of word and wisdom), the tutelage deities of attributes viz. SATHWA, RAJAH and TAMA (goodness, passion, and darkness), the union of trio-energies like wisdom, wish and execu-**

tion for the sake of creation protection and destruction, like the confluence of the sacred rivers Ganges, Yamuna and SARASWATHI having got splendidly united are shining like THRIVENI. As you have 'how taken to 'you' SHANMUKHA, SHARAVANABHAVA' and graciously nourished, kindly take me also into the very lap of you and having harkened to my entreating, fondly rule me. As I am not at all interested to lead this sinful life on the selfish path on this land of KARMA, I have taken your refugee and fallen at your porch. Indeed it's your very responsibility to bear us, reform us upholding and kindly endow us with ever after destinies viz. virtuous salvation or rescue.

42. ఉ ॥ నిర్గుణదైవమందు నొక నిర్ణయమేర్పడ తన్నుతాను సం
సర్గముతో జనింపగని, శక్తిని కల్గగజేయ,దానిదా
మార్గమునందునన్ సగుణ మాతలు తండ్రులు ముగ్గురేర్పడన్
వర్గములై ప్రపంచమయె, భౌతిక దైవిక శక్తి కూడగన్ !

(భావార్థం :-ఈ సృష్టిస్థితిలయక్రమము బహు విచిత్రమైనది సుమా ! ఓ చాముండేశ్వరీ ! నిర్గుణ పరబ్రహ్మమునందు -ఒకానొకప్పుడు-ఏకమైన తాను అనేకమయ్యెదనని ఊహించినంతనే-అనేకముచేయు మాయాశక్తి ఉద్భవమై,బ్రహ్మమును తనలో కలుపుకొని, తాను బ్రహ్మములోకలిసి,ఏకమనేకముకాగా-సృష్టిస్థితిలయముల కధిదేవతలుగా, మాతాపితలు మూడుజంటలుగా, పెరిగి వశీకరణమై,పంచీకరణమై,అండపిండ,బ్రహ్మాండములుగా మారి జగత్-జనది(జాయతే-గచ్ఛతి=ఇతి జగత్-పుట్టుట గిట్టుట కలిగినది-జగత్) ఇదియే ప్రపంచమనబడుచున్నది. నీవే ప్రపంచము.)

(Meanig :-The order of creation, protection and destruction is verily very singular! OH! CHAAMUNDESWARI! In the summum-bonum, with the devoid of attributes -

**once thence in a while - She being one/single, when thought of becoming forms of multiplicity - the MAAYA SHAKTHI, the power of illusion or illusive energy, having begotten by itself and by merging the summum-bonum into it and by conjoining itself into the summum-bonum, one when become being in multiplicity, you grow and get categorized into three pairs as the as the governing deities of creation, protection and destruction, as in the form of respective Divine Mother and Divine Father and you become five-elements and turn formed yourself into egg-fetus and universal cell, you become the universe ( the one that has birth and death). This is what generally called the universe. And DEVI you are the universe.)**

**43. ఉ ॥ తర్కము చాలదమ్మ నిను దర్శనమందగ, శబ్ద శాస్త్రమున్**
**కర్కశ మంత్రతంత్రము, లగాధ గభీరపు వేదభాష్యముల్,**
**మూర్ఖపు వాదముల్, వినగ మూర్ఛిల జేసెడు మొండి చర్చలున్**
**అర్కుని కాంతిలో వెలుగు నమ్మవు నీదగు భక్తి చాలునే !**

**(భావార్థం :–ఓ గాయత్రీదేవీ ! ఇలాంటి మహామహిమాన్వితమైన, త్రిశక్తి స్వరూపిణివైన నీ మాతృమూర్తిని దర్శించుటకు కేవలశాస్త్రజ్ఞానము ఏమాత్రము చాలదమ్మా ! తర్కశాస్త్రముగాని,శబ్దశాస్త్రముగాని,మంత్ర శాస్త్రముగాని,ఇతర వేదాంగములుగాని,వాదప్రతివాదములుగాని,చర్చాగోష్ఠ లుగాని సరిపోవు,ఉపయోగపడవు.సవితృమండల మధ్యవర్తినివైన నిన్ను త్రిసంధ్యలలో నిష్ఠాగరిష్ఠమైన మనస్సుతో ఉపాసించినచో,భక్తి కుదురును. ఆ భక్తిద్వారా మాత్రమే నిన్ను హృదయాంతరాళములో దర్శించగలము కదా!)**

**(Meanig :-OH! GAYATHRI DEVI! Mere scientific knowledge in philanthropic manner is not at all suffi-**

**cient enough to have the DHARSHAN (sight) of your amazingly powerful idol, the embodiment of motherliness and who is the abode of the trio-energies. Neither logic nor the science of phonetics (sound) nor the science of sacred spells nor the appendixes of VEDAS nor arguments nor discussions are sufficient or useful. We get set in devotion when we do UPAASANA (worship) to you who are in the middle of solar-flex .indeed we can have you seen from the core of our hearts through devotion with rigorously disciplined heart during the meeting times of forenoon, the noon and the afternoon. )**

**44. తే.గీ ॥ భక్తి యొక్కటి నీమీద పట్టువడిన**
**తక్కుదంతయు దానంత తాను తెలియు**
**భక్తి లేనిది చదువెంత వచ్చి గూడ-**
**నిన్ను తెలియుట జరుగదు నిశ్చయముగ !**

**(భావార్థం :-ఓ త్రిమూర్తి స్వరూపిణీ ! గాయత్రీ సావిత్రీ సరస్వతీ త్రిమాతృ స్వరూపదేవీ నీ భక్తి ఒక్కటి సిద్ధించినచో, తెలుసు కోవలసిన దంతయూ,ఏ ఇతర శాస్త్రసహాయము లేకపోయిననూ, తనంతతానుగా తెలియును.భక్తికుదరక పోయినచో కేవలమైన చదువెంత చదువు కొన్ననూ నీ దేవీతత్త్వము అవగాహన కాదు-ఇది ముమ్మాటికి నిజము తల్లీ ! )**

**(Meanig :-Oh! The embodiment of the Triad-Deities! The embodiment of the Triad-Divine Mothers viz. the deities GAAYATHRI, SAVITHRI and SARASWATHI! If we accomplish the devotion upon you, whatever to be known or yet to be known or grasped, even without the help of any science, will automatically be comprehended by itself. If the devotion is not set in, mere education though as much as is studied or learnt, your philosophy**

of divinity can't at all be apprehended. This is indeed the truth Oh! Divine Mother.)

45. తే.గీ ॥ వెఱ్ఱివాడను గావున పిచ్చికవిత
చెప్పినాడను నీమీద చింత దీర !
భక్తి పారవశ్యానికి పారమేడ ?
అమ్మ చాముండి ! ఆలించి ఆదరించు !

(భావార్థం :-అమ్మా ! చాముండీ దేవీ ! భక్తి ఒక అపార శక్తిపూరిత దేవీతత్త్వము- నీ రూపమే సుమా ! అత్యంత ప్రభావాన్వితమైనది. నీవే భక్తి -భక్తియే నీవు ! నీకెలా పారములేదో-హద్దులేదో, నీ రూపాంతరమే యైన భక్తికి కూడా-హద్దులేదు.భక్తి అలవడిన భక్తుడుకూడ నీ స్వరూపమే అవుతాడు.భక్తిలో మునిగిపోతాడు. పారవశ్యం చెందుతాడు.పారవశ్యానికి హద్దు అంటూ ఏముంది ? ఆ భక్తిపారవశ్యం ఒక ఆవేశంకనుక, ప్రాపంచిక స్థితికి పూర్తిగ భిన్నం కనుక-ఇతరులకు పిచ్చిగా కనపడుట సహజం. అందుకని వెఱ్ఱివాని ఆవేశంలో వచ్చిన కవిత అని నీవుకూడ వారివలె భావించి చులకన చేయక వినుమమ్మా ! ఆలించి ఆదరించమ్మా !)

(Meanig :-Oh! Divine Mother! CHAAMUNDEE DEVI! Devotion is the philosophy of DEVI including your peer-less potency. That's verily 'the form of yours'. It is quite effective indeed. You are the devotion and the devotion is very you. As you don't have any limit or boundary, the devotion which is another form of you also doesn't have any further. The person who has accustomed to your devotion also becomes the form of you, the devotion and conjoins himself in devotion and gets wrapt in ecstasy. How does rapture have any boundary? That devotion of ecstasy as it is a commotion or a feel of temperament, as

it is completely different from the system or plight of the universe, it naturally does appear as insanity, commonly to others. So I request you not to ridicule or humiliate me like others assuming that this composition of me also is a product that has come from fool's impulsive commotion. So please hearken to me and host.)

46. కం ॥ నీవే శక్తివి, శక్తవు
నీవే, సృష్టి స్థితి లయ నిపుణవు నీవే !
నీవే గూడగ తనలో
నీవే తానై తనంత నీవై నిలిచెన్ !

(భావార్థం :- నీవు సగుణరూపిణివి-శక్తివి. నీ మూలమైన -నిర్గుణబ్రహ్మలో నుండి వచ్చినదానవు గాన, నీకొరకు తాను శక్తగా మారినాడు. అనగా శక్తవు శక్తివి నీవే ! మీరిద్దరు మాతాపితరులై సృష్టిస్థితిలయకర్తలై-ఈ అండపిండబ్రహ్మాండములకు మూల కారకుల గుచున్నారు. )

(Meanig :-You are the embodiment of the virtuous attributes and you are the potency (omnipotent). As you have derived from the 'the devoid of Summum-bonum, He, the consort of you, has become SHAKTHA (the consort of SHAKTHI (potency) for you. Therefore you are indeed SHAKTHI and SHAKTHA. Both of you, by having become the Divine Mother and the Divine Father, and having become the executors of the creation, the sustenance and the destruction, thus being the route-founders of the egg-fetus and the universal cell. )

47. తే.గీ॥ నీవు శేషమైన నీశక్త శేషియౌ,
శేషిగాగ నీవు శేష మతను
శేషశేషితనము చిత్రమౌ ధర్మంబు

జగతి పుట్ట, నిలువ, చనగ చండి !

(భావార్థం :-ఈ ప్రపంచ సృజన కార్యక్రమంలో మీరిద్దరు శేషశేషులగుచున్నారు. శక్త కార్యనిర్వాహకుడైనచో శేషి అవుతాడు-శక్తి శేషము అవుతుంది. శక్తి కార్యనిర్వాహకురాలైనచో శేషి అవుతుంది-శక్త శేషము అవుతాడు. -ఇదొక అద్భుతమైన,విచిత్రమైన సన్నివేశము ! నీ అనుగ్రహములేనిచో ఒకపట్టాన అర్థంకాదు తల్లి ! నీపై అలవడిన భక్తియే-నీ రూపమే-అర్థమగునట్లు చేయగలదు. నీ భక్తుడు అప్పుడే-తెలుసుకోగలుగుతాడు.)

**(Meanig :-In the creative programme of the universe both of you become SESHA and SESHI. When SHAKTH is executor, he becomes 'SESHI'. SHAKTHI becomes SESHAM (reminiscence). When SHAKTHI is executor, she becomes 'SESHI'. SHAKTHA becomes SESHAM (reminiscence). This is a wonderful and singular occurrence. Oh! Mother! It can't be understood that easy without your favor or blessings. The devotion that sets upon you, the very form of you can make us it understood. Then only your devotee can know you.)**

48. సీ ॥ చిత్రమైనట్టి నీ శిల్పమ్ము చూడగా

నాశ్చర్య మౌనమ్మ ఆదిదేవి !

పదునెనిమిది భుజ పంక్తిలో దాగున్న

సంకేత సంఖ్యయే శక్తి దెలుపు

జగతిలో నీ శక్తి సమసించి యుందన్న

సత్యంబు నెరిగింతు నిత్యమీవు

వెలుగుచీకటులును వెనువెంట ప్రవహింప

పవలు రేలు దినము బ్రదుకు చేసి

తే.గీ ॥ సుఖము దుఃఖములు కలిపి సూత్రపరచి

కర్మ నొకదాని జోడించి గణన చేతు !
నిన్ను నెరుగని మొరకుల వెన్ను విరుతు,
భక్తి సేవించు వారికి ముక్తి నిత్తు !

(**భావార్థం :-**ఓ ఆదిదేవీ ! చిటుకులలో వెలిసిన, ప్రతిష్ఠితమైన నీ శిల్పము చూపరులకు అద్భుతమైన దృశ్యమై ఆశ్చర్యము కల్గించుచున్నది. నీ భుజపంక్తిలోనున్న సంఖ్యావిశేషము సంకేత రహస్యమును,నీ త్రిశక్తితత్త్వమును తెలుపుచున్నది తల్లీ ! సృష్టికర్త్రివైన నీవు ఈ జగతిలో మిళితమైయున్నావన్న నిజమును ప్రతిక్షణము నీ భక్తులకు అనుభవ పూర్వకముగా తెలియబరతువు. ఈ భూఖండముపై సూర్యోదయ, సూర్యాస్తమయములను ఒకదాని వెంటనొకటి నియతి దప్పక జరిగించుచూ,పగలురేలు కలుగజేయుచు,నిద్రా జాగ్రదావస్థలను, దైనందిన కార్యక్రమములను,సుఖదుఃఖములను ఒకదానితో నొకటి జతకూర్చి,కర్మసూత్రమును బంధించి బ్రతుకు వెళ్ళదీయునట్లు నియంత్రించుచున్నావు. ఈ సత్యమెరిగి జీవించువారికి ముక్తి నొసంగుచున్నావు. ఎరుగని మూర్ఖులను జననమరణ చక్రములో బడవేయుచున్నావు గదా ! )

(**Meanig :-**OH! AADHI DEVI, the route deity, the idol that's installed, having become a wonderful image, is amazing the spectators. The secret behind the number series of your shoulders, Oh! Divine Mother, reveals us the secrecy of its sign and philosophy of your trio-potency. You also let your devotees revealed, the truth by experience every second that you, being the creator of the universe, are conjoined in the universe. You only on this sphere of the Earth keep the dawn of the Sun and the set of the Sun, going on one after one. You beget the

**day and night and compile the conditions of sleep and awakening, daily activities, happiness and sorrow; you thus control all to let lives go by bonding all into 'KARMA SUTHRA'. And you bestow them with beatitude who lead their lives with the perception of this very truth. Indeed you let fall the bigots who do not know this fact, into the cycle of birth and death.)**

**49.** **ఉ ॥నేనొక నిద్రలో గనగ నిశ్చలరూపవవు ధ్యానమగ్నవై**
**మానసపద్మమందు శివమంత్రము నేకత నుచ్చరించుచున్**
**మౌనపు ముద్రనుంటివట ! మౌనులు ధ్యాతలు లోక-యాత్రనే**
**మానిరి, ధ్యానమెంత ఘనమైనదటంచును తెల్పగోరుచున్ !**

**(భావార్థం :-నిన్ను ధ్యానించుచూ నిద్రలోకి జారుకొన్న నాకు విచిత్రమైన స్వప్నము ఒకటి కనబడినది దేవీ ! అందులో నీవు నీ హృదయపద్మమందు శ్రీశివరూపము ధ్యానముచేయుచూ,శ్రీ పంచాక్షరీ మంత్రమును జపించుచూ సమాధి స్థితి యందున్నట్లు నీవు గోచరించినావు.ఆ సమయమందు ఋషులు ,మౌనులు లోకయాత్రను మరిచి ధ్యానములో నుంటిరట !ఇది ఎంత అద్భుతమైన దృశ్యమో గదా ! ధ్యానమహిమను తెలుపుతూ జీవుల నుద్ధరించుటకై, యోగమార్గమును నేర్పుటకై, ఆచరణపూర్వకముగా భక్తులకు నేర్పుచున్నావు ఓ యోగేశ్వరీ ! )**

**(Meanig :-On contemplating upon you when I have fallen into sleep, Oh! Devi!, I have witnessed a singular dream. In that very dream you have appeared in 'SAMAADHI STHITHI', (the deep state of devout abstraction and absorption of thought acquired, through yogic meditation by a recluse.), in your flower of heart, while meditating upon the form of SHRI SHIVAA and chanting the hymn PANCHAAKSHARI (OM NAMAH SIVAAYA). At the very time, the sages and the recluses, having forgotten their journey around universe, verily they remain**

in contemplation of you. Indeed, it's a wonderful scene, Oh! YOGESWARI!, while revealing the greatness of meditation and in order to reform and protect all the creatures, you are indeed teaching your devotees in practical. )

**50.** ఉ ॥ నీవొక బోద్ధ్రివై జగతి నీదగు బోధను వ్యాప్తిచేయుచున్
లేవిక దానికిన్ సమము లీభువి వేరొకలోకమునందునన్
జీవికి ప్రాణికిన్ తుదకు చేతనమందున ముక్తి నొందుటే
కావలయున్ మరే విధము గల్గదటంచును దెల్పుచుంటివో !

(భావార్థం :-ఓ జోగుళాంబా ! ధ్యానసాధన చాలగొప్పది.జీవులు జప,తప,ధ్యాన, యోగ,ప్రాణాయామాదులద్వారా తమను తాము ప్రాపంచిక బంధనముల నుండి ఉద్ధరించుకొనవలెనని, ముక్తులుగా వలెనని,ఈ జగన్మండలములోని ఏలోకమునందును ఈయోగ సాధనమును మించిన మోక్షమార్గము వేరొకటి లేదని నీవు స్వయముగా సాధనచేయుచూ,బోధకురాలవై జీవశక్తి చైతన్య శక్తిలో లీనము గావలెనని బోధించు చున్నావు మాతా ! )

(Meanig :-OH! JOGULAAMBA! The practice of meditation is very great and zenith. OH! The divine Mother, the living beings through self-mortification, meditation while reciting the charms inaudibly, contemplating in silence without moving lips, the practice of abstraction and meditation and PRANAAYAAMA( a ritual mode of breathing while mentally reciting certain sacred hymns by stopping one nostril and inhaling or exhaling through the other attentively), should liberate by rescuing themselves from the fetters of mundane ties, you being the preacher by practicing yourself, by 'YOGA SAADHANA'(keeping the body in a fixed posture for spiritual worship or supernatural practice of abstract

contemplation), are saying that no other path of beatitude is existed in any universe out of all multitude of the universes than the practice of YOGA. OH! The divine Mother, the Mother of all. Thus you are teaching the potency in life should get conjoined into the energy of consciousness.)

51. శా ॥ చిత్తము నిల్వదంచునొక చిత్రపు వాదన చేయుచుందునే
బొత్తిగ యత్నమే పగిది బూనక,ధ్యానము చేయబోవగన్
చెత్తపనుల్, పదాలు విన చెప్పగ చేయగ చిత్త మేగతిన్
తొత్తుగ వచ్చునో బగళ ! తుచ్ఛపు జీవన మేటికో గదే !

(భావార్థం :-ఓ బగళాంబా ! యోగసాధన గురించి చర్చించుచూ, నేనొక సోమరిపోతునై ఒక చిత్రమైన వాదనను చేయుటం ప్రారంభించినాను.ఏ ప్రయత్నమూ చేయకుండ "మనస్సు నిల్వటంలేదు-ఏకాగ్రత కుదరటంలేదు" అని అజ్ఞాన వాక్యాలు మాట్లాడుతున్నాను.సమయందొరకటం లేదనేది సారాంశం.చెత్తపనులు చేయటానికి, వ్యర్థవాక్యాలు మాట్లాడటానికి,సిద్ధపడి ముందుకువచ్చే మనసు- ధ్యాననిష్ఠాపూర్వక జపతపాలకు ఎందుకు స్వాధీనము కాదో- తెలియదు.ఇలాటి తుచ్ఛమైన బ్రతుకెందుకో అర్థంకావటంలేదు. )

(Meanig :-OH! BAGALAMBA! I'm, being an idle person, while discussing the practice of YOGA, have commenced a singular argument without putting any effort at all, stating that - I'm not getting any concentration and my mind is not setting at all. Thus I'm talking wiseless sentences. The sap of it is that I'm not getting the time, my heart which gets ready to do waste tasks and talk futile sentences; I don't know why it doesn't be submissive to meditation, contemplation, worship and penance. I don't know why this futile-life is meant for?)

52. ఉ ॥ ఎప్పుడు నీవు రమ్మనెదొ ! ఏవిధి నీకడ జేరచేతువో !
చెప్పగలేము తల్లి !తమచిత్తము చేతన ప్రేరకంబులై
యొప్పుగ మాకు జేరగనె నున్నవళాన ప్రయాణమై వెసన్
చప్పున చేరుకొందుమట,చల్లని పాదములందు వాలగన్ !

(భావార్థం :-ఓ చాముండేశ్వరీ ! నీ దర్శనభాగ్యము లభించుట అంత తేలికైన అదృష్టముకాదు గదా ! అనుభవపూర్వకముగా తెలుసుకొన్నదేమంటే- భక్తులము మేము కోరుకొనుట మాత్రమే కాదు-నీవును కోరికమన్నించి, పరిస్థితులననుకూలింపచేసి- మాకు తెలియకుండగనే, హఠాత్తుగా ముహూర్త మేర్పాటుచేసి, మా చిత్తములందు ప్రేరణ కలిగింతువు. మేమున్నవళాన పయనమై,చప్పున చిటుకులకు చేరుకుందుము-నీ చల్లని పాద పద్మములందు వాలిపోదుము. అంతా నీ దయావిశేషము తల్లీ ! )

(Meanig :-OH! CHAAMUNDESWARI! Indeed, it's not that easy-fortune to have had your DHARSHAN what we have come to know through our experience is - it's not possible to have your divine eye glance though we being the devotees of you, seek you to grant us it. But you also, having accepted our aspiration of seeing you, by favoring us with the conditions without the perception of us and by setting up MUHOORTHAM(the auspicious time for DHARSHAN), you create thus, inspiration in us. Thus we abruptly move and at once reach to CHITUKULA and we lie down at your holy feet. Oh! The divine Mother! This is all your kindness and mercy.)

53. సీ ॥ నీ దివ్య రూపంబు నేనెద జూడంగ
లోకాన దృశ్యాలు నాకు వలదు,
నీ దివ్యనామంబు నేనోట బల్కంగ
లోకాన నేమాట నాకు వలదు,

నీ దివ్య గానంబు నే విన్న వీనులన్
లోకాన నేపాట నాకు వలదు,
నీ దివ్య పదధూళి నేమూర్ధ్ని దాల్చంగ
లోకాన వాసనల్ నాకు వలదు,
తే.గీ ॥ నీదు దివ్యంపు గుడిచుట్టు నేను తిరుగ,
నీదు పూజకు పుష్పాలు నేను తేర,
నీదు భక్తుల సేవలో నేను చేర,
నాదు బ్రతుకింక ధన్యమౌ నాదరూప !

(భావార్థం :-ఓ నాద స్వరూపిణీ ! నీ దివ్య స్వరూపాన్ని నేను నా హృదయమునందు దర్శించినచో ఇక ఏ విధమైన భౌతికదృశ్యాలు నేను మెచ్చను. నీ దివ్య నామమును నేను నోరార పల్కినచో ఇక ఏ విధమైన భౌతికశబ్దములు నేను మెచ్చను. నీ దివ్య గానమును నేను చెవులార విన్నచో ఇక ఏ విధమైన భౌతికగీతములను నేను మెచ్చను. నీ దివ్యపాదదూళి నేను మూర్ధ్నిపై ధరించి ఆఘ్రాణించినచో ఇక ఏ విధమైన భౌతిక గంధములను నేను మెచ్చను. దివ్యమైన నీ దేవాలయమును ప్రదక్షిణలు చేసినచో, నీ పూజ కొరకు పూలను ఏరి తెచ్చినచో, నీ భక్తుల సేవలో నేను పాల్గొన్నచో నా పుట్టుక,నా జీవితము ధన్యమైనదని నేను విశ్వసించు చున్నాను.)

(Meanig :-OH! NAADHA SWAROOPINI (the abode and force of musical notes)! If I have had your DHARSHAN in my heart, I can't appreciate any physical scenes or visions henceforth. If I utter the divine incantation of you mouthful, I can't commend any physical sounds further. If I have hearkened your divine music distinctly, I can't applaud any physical songs hereafter. If I having worn, the divine dust of your holy feet on my head and smell it, I can't appreciate any physical

scents here after. I feel my birth and life are blest if I have had the circumambulation(paying homage, by solemnly walking around the temple or image with the right hand towards it) around your temple, if I have brought flowers having collected them by myself for you, and if I have participated in the service of your devotee-folk.)

54. కం ॥ నవ్వేడి కళ్ళును, పళ్ళును,

నవ్వేడి పెదవులు, సెలవులు, నవ్వేడి బుగ్గల్,

నవ్వేడి బొమ్మలు, నుదురును,

నవ్వేడి చండిని తెలుపును–నవ్వుల తీరున్ !

(భావార్థం :–ఓ చాముండేశ్వరీ ! నీ చిరునవ్వు ఎంత అందమైనదో, ఎంత ఆకర్షణీయమైనదో అనుభవించిన వారికే తెలియును. నీవు నవ్వుచున్నప్పుడు నీ కళ్ళలోని శోభ, పళ్ళలోని కాంతి, పెదవులలోని దీప్తి, సెలవులలోని సొబగు, చెక్కిళ్ళలోని ఛ్ఛవి, కనుబొమ్మలలోని సొగసు, నుదురులోని అందం అద్వితీయమని– ఆనవ్వు నీకే సొంతమని తెలియజేయును. )

(Meanig :-OH! CHAAMUNDESWARI! How beautiful your serene-smile is and how attractive it is, who experience this, only, can understand this. The radiance in your eyes while smiling, the light your teeth shine, the lustre upon your tender lips, the prettiness in the corners of your very mouth, the ray-full effulgence upon your cheeks, the elegance of your finest eye-brows, the beautifulness on your forehead, are unparalleled and unequalled and they (the features mentioned above) clearly reveal that the divine-smiling indeed is only yours.)

55. కం ॥ అందము చిందెడు మోమున

నందము చిరునవ్వు కళ్ళు నాదరమొప్పన్ !

సుందరచండికి తగు-నర

విందము విచ్చిన వగిదిని విరిసిన నగవుల్ !

(భావార్థం :-ఓ చాముండేశ్వరీ ! నీ నవ్వు ఒక ప్రత్యేకతను సంతరించుకొన్నది. ముఖమంతయు వ్యాపించి, కన్నులలో దివ్యజ్యోతిని వెలిగించినట్లు దీపించుచున్నది. నీవు నవ్వుచున్నప్పుడు అరవిందము విచ్చుకొన్నట్లనిపించు చున్నది.)

(Meanig :-OH! CHAAMUNDESWARI! Your smile has acquired a specialty. It, having extended entire the face as if a divine radiance or refulgence be lit, is shining while you are smiling as it does seem as if the lotus be blooming!)

56. కం ॥ చూడగ నేతెంచు జనుల

జాడలు కనగనె మొగమున చయ్యనవిచ్చున్

వేడుక మునుపటి నవ్వులు-

నాడెడి చండికి చిటుకుల నరవిందముగాన్ !

(భావార్థం :-ఓ చాముండేశ్వరీ ! నీ సందర్శనార్థ మేగుదెంచుచున్న భక్త జనుల జాడలు దవుదవ్వుల దోపించగనే-సంతోషముతో -పద్మమువలె -నీముఖము వికసించవగా-ఆ ప్రాంతమంతా పద్మాలు విచ్చుకొన్నట్లు ప్రకాశవంతమగుచున్నది. )

(Meanig :-OH! CHAAMUNDESWARI! When you happen to see your devotees approaching you afar at a distance, your face blossoms like a lotus and the entire the premises also as if many a lotus were blowing, illumines at once.)

57. ఉ ॥ కోరిన కోర్కెలన్ నొసగు కొంగునబంగరమైన చండి ! నీ

వారలు చూడరాగ నిట పాంథులు శాంతిని బొందగా మహా

నీరదశీతలాన్విత వినిర్మితశాలను నిల్పినావు ! ఓ

పారదరూపిణీ ! యిచట భక్తులు పొందని కోర్కెలుండునే !

(భావార్థం :–ఓ చండీ ! పాదరసమువలె స్వచ్ఛమైన ఆకృతిగలదానా ! నీ భక్తులకోర్కెలను నెరవేర్చుచు –కొంగుబంగారమై,ప్రఖ్యాతి వడసిన నీ సందర్శనార్థము నిత్యము వేలాదిగావచ్చు భక్తుల సౌకర్యార్థము చల్లని మంటపమును విశాలప్రాంగణమున నిర్మింపజేసినావుకదా ! ఇట భక్తులు శాంతచిత్తులై నీ పూజలు చేయుగా వారుపొందని కోర్కులుండునా ? )

(Meanig :-OH! CHAAMUNDI, the one who has the crystal-main as mercury! As you are celebrated being the gold in the hem, fulfilling the desires of your devotees, who come to have your DHARSHAN in thousands and for the convenience of them indeed you have made a cool MANDAPA (the four-pillared porch) constructed in a very spacious area. Are there any desires unfulfilled for those gentle votaries with peace and tranquility who worship you?)

58. కం ॥ రేయిని కొలువగ వాంఛా
దాయిని ! పదునాలుగు జగదావాసులు దా
దోయిలి నిండుగ సుమములు
హాయిగ గొంచును చిటుకుల కరుదెంతురుగా !

(భావార్థం :–ఓ వాంఛాప్రదాయినీ ! భూలోకములోని నీ ఖ్యాతి సరాసరిగా దేవలోకమునందు వ్యాపింపగా–అలా పదునాలుగు జగములకు చేరగా– ఆ జగదావాసులందరూ దోసిళ్ళనిండుగా దివ్యకుసుమములను నింపుకొనిరాత్రిళ్ళు నినుసేవించుకొనుటకై హాయిగా వత్తురని–చిటుకుల వాసులు–కీర్తించుచున్నారు. )

(Meanig :-OH! VAAMCHAA PRADHAAYANI, the quencher of all the desires or genuine longings! The celebrity of you on the earth when prevails as it is into the world of deities. And you are being extolled by the in-

**habitants of CHITUKULA that all the deities by filling their handfuls with flowers rush to CHITUKULA happily during nights to worshipping you. )**

59. కం ॥ శాంతము జీవుల కవసర
మెంతయొ యంచున్ మునులును ఋషులును నుడువన్
చింతలు బాయగ భక్తులు
చెంతకు వత్తురు–యొసగుమ ! చిటుకుల వాసీ !

(భావార్థం :–ఓ చిటుకులవాసీ ! భారతదేశము ఆర్షభూమి! ఇచట ఋషులు,మునులు, తపమాచరించి తమ అనుభవమును , ఉపనిషత్తులు, పురాణములు ద్వారా ప్రచారముచేసినారు. వారి సంతతి(వారమైన మనమందరము) ముని, ఋషి, తపస్వుల బోధలను ఒంటబట్టించుకొని, శాంతి సంపాదనకై ప్రశాంత ప్రదేశములకు వచ్చుచుందుము. నీ మందిరప్రాంతమునకు మించిన ప్రశాంత స్థలమెక్కడయున్నది.కనుక చిటుకుల కేతెంచిన భక్తులకు శాంతినొసంగుమా ! )

(Meanig :-OH! CHITUKULAVAASI, the dweller of the village CHITUKULA! India is a spiritual or prophetical land. Many sages and recluses having observed penance here, spread their spiritual experience through the legends, a rhapsody, a string of mythological tales and the UPANISHADS, the philosophical disquisitions attached to the VEDAS. The offspring of them, we, the all, having perceived the teachings of seers and sages, arrive to the holy places of peace in quest of tranquility acquired. Other than the premises of your MANDIR where else the peaceful place is? therefore kindly bestow peace on the devotees who come to the village CHITUKULA.)

60. సీ ॥ ఆకాశమార్గాన శ్రీకాశి కేతెంచు
సురజాతి చిటుకుల కరుగుదెంచి,
ఆదివ్య దేవాలయంబులో నీభవ్య
శ్రీమూర్తిరూపమున్ చిరము జూచి,

ఆశ్చర్యజలధిలో నిశ్చేష్టులై మున్గి
అచ్చోట నీ పూజ లాచరించి,
"ఆనంది మించిన ఆనందమూర్తినే
పొందినట్టి ఫలము పొందినాము-
తే.గీ ॥ మాదు దైవత్వ పుణ్యంబు మహిమనందె
మానవుల కిక మేము సమానమంచు "
పొగడసాగిరి వేనోళ్ళ పుణ్యఫలము
చెప్ప తరమౌనె చిటుకుల శ్రేయ మొకట !

(భావార్థం :-ఓ ఆనందమూర్తీ ! దేవతలు ఆకాశమార్గాన కాశికేగుచూ-మార్గ మధ్యంలో చిటుకుల మందిరమును చూశారు.వెంటనే క్రిందకుదిగి వచ్చి దివ్యదేవాలయములో నీ మనోహరమూర్తిని గాంచినారు.ఆశ్చర్యసాగరమున ఓలలాడి వెనువెంటనే కాశిలో చేయదల్చిన పూజా పునస్కారములను చిటుకులలోని నీ మందిరములోనే నిర్వహించి అమితానందమును పొందినారు.ఆనందవనమున నున్న దేవతకన్న గొవ్పదేవతనే పొంది,పూజించి,మహదానందమునే అనుభవించినామని, ' చిటుకులలో పూజలు చేయు మానవులు పొందు శాంతిసౌభాగ్యములు' మేమును పొందినాము, మేము మానవులతో సమానము - అని తమ అదృష్టమును తామే పొగడుకొన్నారు. కాశిని మించిన చిటుకుల,ఆనందిని మించిన చాముండిని పొందిన దేవతలు మానవులతో సమానమగుట అతిశయోక్తి కానేరాదు. )

(Meanig :-OH! AANANDHA MOORTHY, the embodiment of eternal bliss! All the deities while resorting in the path of the sky they happened to see the temple of you. Having come down to CHITUKULA they saw your captivating and fascinating idol. Having bathed in the sea of amazement, what they ought to observe the worshipping or homage in the sacred sight, the pilgrimage,

the holy 'KAASI', having performed them in your very temple, they gained limitless divine bliss. They felt very happy. They praised themselves stating that they had, by gaining great deity, worshipped and experienced the great bliss and bagged the peace and auspiciousness as equitant as the auspiciousness acquired by the human beings. Moreover, they felt that they were as equitant as human beings by this very deed were. It's not exaggeration to be thought by all the deities that they were as equitant as human beings who having visited the CHAAMUNDI, the one who was above 'AANANDINI'.)

61. శా ॥ వైవిధ్యంబగు జీవితంబు గనగా ప్రాణాలు నిత్యాలు–తా
గావంచున్ మదిలో స్ఫురించు బగళా! కైవల్య కాంక్షన్ సదా
జీవింపన్ నిట గోరు భక్తులకునై సిద్ధార్థ మార్గంబులన్
నీవే చూపవటే సమీపగురువై నేత్రాల దీపాలతోన్ !

(భావార్థం :–ఓ బగళాదేవీ ! ఈ భౌతిక జీవితము,దేహము నిత్యములుగావు. కైవల్యమొక్కటే శాశ్వతము. ఈ జీవితమునందే,ఈ మానవదేహముతోనే ఆ కైవల్యమును పొందవలెను. ఆ సాధనలో దేవి సహకారమత్యంత ప్రధానము. కావున సాధక భక్తులు చిటుకుల కేతెంచి నిను సేవింపగా వారికి కావలసిన సాధనసంపత్తినొసగి సన్మార్గమును నీ నేత్రాలదీపాలతో చూపించుమని ప్రార్థించుచున్నాను. )

(Meanig :-OH! BAGALAA DEVI, the embodiment of multiplicities! The material life and body are neither everlasting nor immortal. Beatitude only is the eternal or permanent. That eternal bliss or the beatitude is to be achieved in this very life with this very human body. In accomplishing that ecstatic or eternal-loftiness, the sustenance of DEVI, the Goddess by all means, is principal and important. Therefore the practicing-devotees who

having reached to CHITUKULA, have worshipped you and I'm praying to you to show them the righteous path through the lights of your very eyes, having bestowed them with the required contrivance of prosperity.)

62. శా ॥ ప్రారబ్ధంబగు కర్మ సంచితమున్ ఆగామికర్మంబునున్
వైరుధ్యంబొకయింతలేక క్షయయింపన్ మోక్ష మార్గంబు తా
తారామార్గమువోలె సౌఖ్యకరమౌ తత్త్వార్థసంప్రాప్తికిన్
తారాదేవి ! సుదీర్ఘ యానమున ఆత్మాన్వేషమోక్షార్థికిన్ !

(భావార్థం :–ఓ తారాదేవీ ! కర్మ సంక్షయము తరువాతనే మోక్షము,ఆపై కైవల్యము ! కర్మ మూడు భాగములుగా విభజింపబడి–జీవిని ఆశ్రయించి ఉంటుంది. సంచితము,ప్రారబ్ధము, ఆగామి–అని మూడు విధములు కర్మ. గత జన్మమున చేసినది సంచితము, ఈ జన్మమున చేయుచున్నది ప్రారబ్ధము. రాబోవు జన్మమునకు సంబంధించినది–ఆగామి.ప్రారబ్ధముచే సంచితమును నశింపచేసి ఆగామిని కూడ లేకుండాచేసినచో జీవికి మోక్షము లభించును.ఆపై కైవల్యము సిద్ధించును.ఈ క్రమ మార్గమున నీ సహకార మెంతయో ఆవశ్యకమని సాధకభక్తుడు నిన్నుపాసించుచుండగా సాయ పడుమా ! )

(**Meanig :-**OH! TAARAA DEVI! After the completion of perishing of the entire KARMA, (the deed) only, 'the liberation of the soul from the body' takes place (such as deliverance from the bonds of sense, exemption from sin and punishment). Then only the beatitude, the eternal bliss be realized. KARMA is divided into three parts and courts the being. They are SAMCHITHAM (accumulated or amassed KARMA), PRAARABDHAM (commenced KARMA) and AAGAAMI (the KARMA stored in the future). What we committed ourselves in the past in the previous birth SAMCHITHAM, what

**we are committing in this birth is PRAARABDHAM and AAGAAMI is related to the forthcoming birth. Liberation is certain to a being when his (or her or its) AAGAAMI is bereft after having perished his (or her or its) SAMCHITHAM with his (or her or its) PRAARABDHAM. Then automatically the 'BEATITUDE' is possible to the being. In this very path, kindly extend your sustenance to the conquering-devotee who is worshipping you with a strong belief that your support is very essential and necessary.)**

**63.** శా ॥ చాముండేశ్వరి ! నీ పదాంబుజములన్ శ్రద్ధాళునై మ్రొక్కి శ్రీ
ధామంబైన త్వదీయ దేవళమునున్ దర్శింప నేతేర, నీ
గ్రామంబున్ ఘనజోగిపేట చిటుకుల్ రప్పింపవే వేగమై
చేమంతుల్ కనకాంబరాలు పసుపున్ చెందింప కుంకంబుతోన్!

(**భావార్థం :-**ఓ చిటుకుల నివాసినీ ! చాముండేశ్వరీ ! జోగిపేట మండలములోని చిటుకులగ్రామ సమీపాన వెలిసిన నీ దివ్యమందిరమునకు వచ్చి నిను సందర్శించుటకు ఉవ్విళ్ళూరుచున్న మమ్ము నీవాశీర్వదించి అనుగ్రహించి ఆహ్వానించినచో మేము మహదానందముతో వచ్చి నీ మందిరములో జరుగు నిత్యపూజలో పాల్గొందుము.పసుపుకుంకుమలతో జరుగు నిత్యపూజను జరిపించెదము.చేమంతులు కనకారంబరములతో నిన్నలంకరించి నీ ముగ్ధ మోహన మనోహర సుందరాకారమును తనివి తీరా దర్శించుకొనెదము. )

**(Meanig :-OH! The inhabitant of village CHITUKULA! CHAAMUNDESWARI! If you kindly having blest and favored, welcome us to your divine shrine where you have made your pious appearance yourself in the proximity of CHITUKULA village in JOGIPET MANDAL, We, who are eagerly exited to visit your Holy temple, very**

**happily participate on, in the perpetual adoration of you that's held in the very abode of you. We also hold that perpetual adoration that's held with turmeric and vermillion. Moreover, having adorned you with chrysanthemums and KANAKAAMBARA flowers, we can happily have DHARSHAN of your beauteous, fascinating and heart-stealing divine-form of prettiness in satiety.)**

**64. కం ॥ చండీగణ పతుల, కలిని**

**నిండుగ శాసించువారి నిరతము దలతున్ !**

**గుండియ నిండుగ చండియ**

**యుండగ వెంబడి గణపతి యుండును గాదా !**

**(భావార్థం :-ఓ చాముండేశ్వరీ ! ఈ కలియుగమును శాసించువారు-చండీగణేశ్వరులు మీరిరువురే అని ధర్మశాస్త్రములు నుడువుచున్నవి. కనుక మీ ఇరువురిని మనస్ఫూర్తిగా నేను నిరతము ధ్యానింతును. చండీదేవిని గుండె నిండుగా ధ్యానించినచో ఆమె వెంబడి గణపతికూడా ఉండును గదా! 'కలౌ చండీవినాయకౌ' అను శాస్త్రోక్తి సత్యమే కదా ! )**

**(Meanig :-OH! CHAAMUNDESWARI! All the sciences of right and precepts, the jurisprudence reiterate or speak that both of you, CHANDEE and GANESWARA only rule the age of the KALI, the Iron Age. Therefore, I meditate on you, the both incessantly and wholeheartedly or profoundly. Indeed when we meditate on CHANDEE heart-fully, GANAPATHI also stays along with her. Indeed, it's true as per the declared or commanded in the laws or codes that 'KALOW CHANDEE VINAYAKOW' (where ever is CHANDEE, there Lord GANESHWARA also be, in the Iron Age, as CHANDEE and GANESHWARA only are the grantors of everything upon the devotees).)**

65. సీ ॥ శ్రీదేవి నిను మ్రొక్క శ్రీసిద్ధ గాంధర్వ
విద్యాధరాది దేవేంద్రగణములు
నూర్ధ్వాది లోకాల నున్నట్టి వాసులున్
పూజించి సేవించి పోదురటవె !
పాతాళ లోకాల వాసులున్ క్రమముగా
నాగాదిజాతులున్ నరుగుదెంత్రు,
నడురేయి నీగుడిన్ నరయంగ నన్నగా
మేళాలు తాళాలు మేళవించు,
తే.గీ ॥ జన్మ జన్మల పుణ్యంబు చాలగల్గు
ధన్యజీవులు కనుగొంద్రు తథ్య మిచట !
నీదు భక్తులు తాపుణ్యవేదు లౌట
కర్మమూలంబు చాముండి కతనగాదె !

(భావార్థం :-ఓ శ్రీదేవీ !చతుర్దశలోకాలలోనున్న దేవదానవ నాగ గంధర్వాదులు ఊర్ధ్వపాతాళల లోకవాసులందరూ నీ పూజా పునస్కారా దులలో పాల్గొన నేతెంచి రాత్రులందు మంగళతూర్యారావాదులతో పూజ లొనరించి ధన్యులౌదురని ఆ గ్రామ నివాసులు పులకించిపోదురు. ఇదంతయు ఆ గ్రామవాసుల పూర్వజన్మఫలమనియే విద్వాంసుల విశ్వాసము. భక్తి కలుగుటయు , దేవతా పూజలొనరించుటయు కర్మఫల మూల మనియే అనుభవజ్ఞుల సిద్ధాంతము. )

(Meanig :-OH! SREEDEVI! The abode of all sorts of riches! The dwellers of the village CHITUKULA tingle all the way themselves, having known that the divine beings viz. DEVA, DAANAVA, NAAGA and GANDHARVA etc., the dwellers of the fourteen universes and the world-above and the lower or netherworld, in order to participate in your 'homage and the like', arrive during nights and perform your worship

and become eternal, playing auspicious musical instruments and feel eternally blest with divine delight. It is the faith of the men of letters that all these are the fruits of yester-births of those villagers. 'The doctrine of the experienced' is that getting the devotion and devoting or worshipping deities are the root fruit of one's own KARMA or deed.)

66. తే.గీ ॥నీదు మందిర స్థాపన మాదు మదిని
మంచి చేరంగ, మారంగ మాదు బ్రతుకు
పుణ్యమూలాన జరిగెనే పుణ్యమూర్తి !
దాని వెనుక నీవుండుటే దైవఘటన !

(భావార్థం :–ఓ పుణ్యమూర్తీ ! నీ మందిర నిర్మాణము, నీ దివ్యవిగ్రహప్రతిష్ఠ మా పుణ్యమూలాన జరిగినదని మేమందరము విశ్వసింతుము. పుణ్యమునకు హేతువు మా సత్కర్మయని నీవు మాకు తెలియజేయుటయు ఆ సత్కర్మఫలమే–విశేషమేమనగ మా కర్మ వెనుక నీవు ప్రోద్బలముగా నుండుట–గొప్ప దైవఘటన ! )

(Meanig :-OH! PUNYAMURTHY, the embodiment of virtuous deeds! We believe that construction of your MANDHIR and installation of your divine image has taken place due to our 'root of good deeds'. It is obvious that the reason of 'that good deed' is our 'act of piety' and you revealing us know it is also the fruit of that same good deed. However, the specialty is that your support and sustenance behind our KARMA and that is the very providential.)

67. తే.గీ॥ భక్తి కలుగుట పుణ్యప్రభావముననె
పుణ్యమది కర్మమూలాన ప్రోదియగును,
కర్మ మది మంచి చేరంగ కలుగు నంచు,

మంచి సత్సంగవాసమునుంచి కలుగు !

67. ఓ చాముండేశ్వరీ ! నీ దయాగుణము సముద్రమువంటిది ! కురిసిన వాన చినుకులు కాలువకాగా, కాలువలు నదులుకాగా , ఆ నదులు సముద్రము కాగా–సముద్రము దేవీ స్వరూపముకాగా ఈ విశ్వమంతయు నీవు నిండియున్నావని అన్యాపదేశముగా తెలియుచున్నావు.పుణ్యము భక్తివలన కలుగును. పుణ్యము కర్మము ద్వారా ఏర్పడును.కర్మము సత్ప్రవర్తన ద్వారా– సత్సంగమువలన, సత్సంగము నీ అనుగ్రహమువలన కలుగునని ఇది ధర్మచక్రమని ధార్మికులభావన. )

(Meanig :-OH! CHAAMUNDESWARI! Your pious clemency is like an ocean. The showered raindrops make streams, the streams into the rivers and the rivers into a sea - when sea is the embodiment or form of DEVI (you), you are thus revealed 'by innuendo' that you are filled or al-pervaded in the entire universe. Virtue (PUNHYAM) is borne by the devotion and it is determined through KARMA - KARMA through good behavior - and with the association of truthful men - and 'that' with your blessings take place and it is the notion or perception of the pious men that it is only the wheel of DHARMA.)

68. ఉ ॥ నీదగు దృష్టిసోకగనె నిర్మల మౌ మది, చింతబాయగన్
బోదెలుగట్టు మ్రాకునకు బూర్తిగ పెర్గిన శాఖలట్లు, సం
పాదిత భావనల్ పెరిగి పావనకర్మలు చేయగల్గు, నా
మోదిత కర్మలే ఫలము మొత్తము కాయును లోకసేవకై !

(భావార్థం :- ఓ లోకేశ్వరీ ! నీ దయాదృష్టి సోకినంతనే మా మనస్సు నిర్మలమై సత్కార్యాచరణకై నుద్యమించును. పెరిగిన వృక్షమునకు శాఖలు

బోదె పెరిగి ఫలములు కాసినట్లు,సత్కర్మలకు సత్ఫలములు అంది వచ్చును. అవి లోకసేవకై, అలానే నీ సేవకై పరివర్తితములగును.

**(Meanig :-OH! LOKESWARI, the empress of the entire universe! As soon as your divine eye-glance of mercy touches our very hearts, they become free from the impurities and they attempt to perform the deeds of piety. As the trunk and branches grow and yield fruits to a grown-up tree, we gain good results for good deeds and they remain or abide in turn for the service of the world and for the service of yours. )**

**69.** కం ॥ ఎందరు గురువులు పూర్వము
చిందర వందర జగతికి శ్రేయము గలుగన్
డెందము నిండుగ దలచిరి
అందరు నీ ప్రేమతోడ అంబుజ నేత్రా !

(భావార్థం :-ఈ సద్భావనా వ్యాప్తికై భారతదేశమున పూర్వకాలము నుండియు,ఋషి ముని గణము పీఠములు స్థాపించి, గురుకులములు ఏర్పరిచి, ఆర్ష సంప్రదాయమును జగత్తంతయు ప్రచారము చేయుటకు అవిరళకృషి యొనర్చిరి. వారి నిర్విరామ నిస్స్వార్థసేవకు మానవజాతి ఎంతయో ఋణపడియున్నది. వారి బోధలను ఆచరించుటయే వారి ఋణమును తీర్చుకొనుట.ఓ అంబుజ నేత్రా! ఇదంతయూ నీ ప్రేమ ఫలమే!)

**(Meanig :-The assemblage of sages and hermits since the ancient times, having established the diocese (seat) and set forth residential orders or schools in order to putting in practice the spiritual or prophetical customs or traditions in the entire universe, have performed or effected their dense labor and exertion. The entire universe is indebted to them for their respite-less or selfless-service. 'By following their teachings' only is our**

**paying off or discharging their debts. OH! AMBUJA NETRA! The Lotus-eyed Deity! This is all the result of your love and affection.)**

**70. కం ॥దేవతలందరు నీలో**

**జీవము వోయుచు తమంత చేరగ తామే**

**నీవయ ఏకత దేవత**

**వై వరలెద వంచు నిన్ను వర్ణింత్రు శివా !**

**(భావార్థం :-ఓ శివా! సర్వదేవతాగణము తమ శక్తి సామర్థ్యములను ఒకచోట కుప్పపోసి ఏకవీరాదేవతను సృష్టిచేసి తామా ఏకవీర యందు లీనమగుట వలన చాముండేశ్వరివి నీ వే సృష్టికర్త్రివైతివని త్రిమూర్తులు తమ కర్తృత్వమును నీలో పొందుపరిచిరని పురాణములు వివరించుచున్నవి. నీవు త్రిమూర్తి స్వరూపిణివి.త్రిశక్తిధారిణివి,త్రిగుణాతీతవు.)**

**(Meanig :-OH! SHIVAA! The consort of Lord Shiva! Assemblage of all the deities, having piled up their very efficiencies and potencies respectively, have created the deity, 'EKAVEERA' imparting their delegated divine-authorities have conjoined into EKAVEERA themselves and in consequence of that, you having become CHAAMUNDESWARI DEVI have become the creator of this creation. And the Hindu-triad (BRAHMA, VISHNU and MAHESWARA) have imparted or en-trusted their delegated-authoritative-pious-potencies into you. You are the embodiment of the Hindu-triad, the wearer of all the energies of the Hindu-triad and the devoid of the three attributes (THRIGUNA) namely RAJAH (passion), THAMAH (foulness) and SATHVA (truth).**

**71. సీ ॥ అందాలు చిందించు నక్షులన్ ప్రసరించి**

ఆర్తికోటుల జూచి అభయ మొసగి,

శుభ్రాంశు కిరణాలు చూడ్కులు నిగిడించి

అర్థికోటుల గాంచి అమృత మొసగి,

పదునెనిమిది భుజపంక్తిలో దాల్చిన

అస్త్రాల,శస్త్రాల నరుల దునిమి,

ఆర్గురు శత్రులన్ అంతరంగము జీల్చి

హుంకారమున వారి బింక మణచి,

తే.గీ ॥ అవతరణహేతు విదియంచు వివరణ మిడ

జోగిపేటలో చిటుకుల స్ఫూర్తి యైన

మాత శ్రీదేవి చాముండి మమత కొరకు

చెంత సాగిలబడ్డాము చేరదీయ !

(భావార్థం :-ఓ భువనేశ్వరీ ! నీ యంతనీవు జోగిపేట మండలము చిటుకుప్రాంతమున వెలయుటకు కారణము నీ అపారకరుణా స్వభావమే అని మాకు స్పష్టముగా తెలియుచున్నది. నీ సుందర నయనములను విప్పారజేసి ఆర్తితో నలమటించు భక్తులను గాంచి అభయమొసగు చున్నావు. చంద్రకిరణములవంటి చూపులు ప్రసరింపజేసి భక్తుల కోర్కెలను తీర్చి ఆనందమొసగుచున్నావు. అష్టాదశ భుజపంక్తితో ధరించిన అస్త్రశస్త్రాలతో శత్రుసంహార మొనరించి భక్తులకు సమాధిస్థాయి నొసంగుచున్నావు. నీ అవతార రహస్యమిదియేనని సాధకుల మదిని విశ్వాసమును నింపుచున్నావు. కనుక ఓ మాతా !నీ ముందు సాగిలబడినామమ్మా-మమ్మాదరింపుమమ్మా!)

(Meanig :-OH! BHUVANESWAREE! The sovereign of the universe! It's obviously known to us that the reason for your appearing by yourself at the village of CHITUKULA in the JOGIPET MANDAL is the sign of your boundless merciful-nature. Having fully opened

**your beautiful eyes and having seen your devotees who are sinking under affliction, you are granting them the assurance of security, the warranty of safety and the promise of shelter. Having extended the rays of moon-like divine glances of yours, you are quenching the desires or inclinations of your votaries and bestowing bliss upon them. By holding different divine-weaponry or unique armaments with your eighteen mighty arms respectively, having annihilated the foe-folk, the evil forces, or having routed the six classes of foes to 'Good' viz. six passions (desire, wrath, covetousness, lust, arrogance and envy), you are granting the devotees the pious-state of SAMAADHI (absorption of absolute thought in, with devout abstraction, which can only be attained in deep meditation). You are filling the minds of SAADHAKAAS (devotees) with belief and trust that it is the secret behind your divine incarnation. Therefore Oh! The divine Mother, the mother of all! We have prostrated at your holy feet. Please treat us kindly.)**

**72. కం ॥ నిను సేవించిన-దేవత**

**లను నందరను తగ పూజలందుకొనంగా**

**మనకడ కాహ్వానించుట**

**యని యంద్రు దీవెనలీయ ఆరాధ్యవిదుల్ !**

**(భావార్థం :-ఓ సకల దేవతాసమాహార స్వరూపిణీ ! నిను సేవించినచో సకలదేవతలను మన పూజ స్వీకరించుట కాహ్వా నించినట్లే యని ఆరాధ్య వేత్తలు అభయ మొసగుచున్నారు. నీలో సర్వదేవతలు అంతర్భవించి యున్నందున నీ పూజ సర్వ దేవతాపూజ యని, సర్వదేవతలు సంతృప్తి పడుదురని భావన ! )**

**(Meanig :-OH! The embodiment of assemblage of all the**

**deities! The venerable are assuring that it's a welcome to all the deities to receive our heartfelt POOJA (worship) if we just worship you indeed. As you have all the deities included or conjoined in, internally, it's an accepted notion that your worshipping, in turn, is worshipping of all the deities in Toto. Thus all the deities feel satisfied and it's a pious perception of all. )**

**73.శిఖరిణి॥సదా నీ నామంబున్ మదిని దలపన్ సంతసము క-**
**ల్గదా చాముండేశీ ! భువిని యెచటన్నున్నను సరే !**
**పదాంభోజంబుల్ మాహృదిని తిరమై నిల్పుచు ప్రసూ**
**నదామంబుల్గూర్చన్ కలుగును గదా మోదము సతీ !**

**(భావార్థం :-ఓ చాముండేశ్వరీ ! నీ నామమును సదా ధ్యానము చేసినచో మనస్సునకు చెప్పరాని ఆనందము కలుగును. నిత్యజీవనవిధానములో ఎక్కడున్ననూ, ఏ పని చేయుచున్ననూ మనసులో నీ పదాంభోజములు ధ్యానించుచూ, నీ నామమును స్మరించుచూ, నీకు పుష్పపూజ చేయుచున్ననో ఆ ఆనందమే వేరు.ఆ సంతృప్తియే వేరు.)**

**(Meanig :-OH! CHAAMUNDESWARI! If we perpetually meditate on your pious appellations or epithets, our hearts get indescribable happiness. Wherever we are, being engaged as per our daily activities or routine, whatever the work we are on, doing when go on meditating on your lotus-like pious-feet in our hearts, recollecting your divine-names or worshipping you with flowers, the happiness- that we feel out of - is completely different and thus, as the satisfaction of us is. )**

**74. మ ॥ప్రతిరోజూ గుడికేగుదెంచి యట నీ భక్తాళి మోదంబుతో**
**ప్రతిమారాధన సేయగా మదిని సంభావించి, పుష్పాదులున్**
**అతులామోదము గూర్పగా పసుపు గంధాఢ్యాది కుంకంబులున్**

అతిభక్తిన్ గొనివత్తురే తనివితీరా పూజ లర్పింపగాన్ !

(భావార్థం :-ఇక అదృష్టవశాత్తు నీ గుడికేగుదెంచి అవకాశమున్నన్ని నాళ్ళు నీ పూజచేయుటకు ఏర్పాటుచేసికొని నీ భక్తబృందము పసుపు కుంకుమ,పూలు పండ్లు గంధము మొదలైన ద్రవ్యములతో అష్టోత్తర శతనామ పూజచేయించి నీ పాదములపై తలనిడి మ్రొక్కినచో, మదిలోని కోర్కె విన్నవించినచో- అది తీరినచో-కలుగు ఆనందమునకు హద్దులుండునా!

(Meanig :-Fortunately, having gone to your temple henceforth, having made arrangements to perform your POOJA (worship) on all the possible days as per available opportunity, your devotee-folk, having their ASHTOTHARA POOJA performed with the pious ingredients like turmeric, vermillion, sandal-wood, flowers and fruits, having placed their heads at your holy feet, if they bow having revealed you their desires of their hearts - if those wishes are fulfilled (by you). Are there any boundaries to such happiness that's redounded indeed?)

75. కం ॥ మంజీరా తీరమునన్
కెంజాయ వెలుంగులోన కేళీగతులన్
సంజీవినివై వెలిసిన
కంజాతముఖాంబ నీకు కైమోడ్పులివే !

(భావార్థం :–ఓ ముఖీ ! మంజీరానదీ తీరముననున్న నీ మందిర సమీపమున, పరిసరప్రాంతములలో ఉదాయాస్తమాన సమయాలలో కెంజాయ వెలుగులలో నిను కనుగొన్నచో మా హృదయాలు ఆనందపారవశ్యమున కేరింతలు కొట్టునుగదా ! మమ్ముచూచి నీ వెంత సంతసింతువో గదా ! అలాంటి కమలవదనకు నీకు మా నమస్సుమాంజలులివే గొనుమా ! )

(Meanig :-OH! Lotus-faced! During the auspicious times of dawn and dusk in the reddish lights when we perceive you near your temple on the shore of the river MANJEERA and of its neighborhood area, indeed our hearts chuckle with exultant ecstasy or rapturous exultation and on seeing us how much happiness verily you feel! To such a Lotus-faced, to very you, we offer our flowery salutations of our hearts. Kindly accept them.)

76. ఉ ॥ నీవిట నిల్చినా వనగ నేటికి గూడను నమ్మలేము, చా
లా వఱనైన విగ్రహము ! లావును నెత్తును చెప్పలేనివై,
భావఱు త్రోసిరాజనెడు భవ్యపు టందము రాశివౌట–ఐ
లావరఘు యోగి లేపగ నలా నిట నిల్చిన మాటచిత్రమే !

(భావార్థం :–ఓ చాముండేశ్వరీ ! నీ ప్రతిష్ఠా విధానమొక ఆశ్చర్యానుభూతి కారకమని విందుము. నీ విగ్రహము చాల భారీ ప్రమాణమైనది గావున, మేలినైనదిగావున సాధారణముగా లేపుటకు ప్రతిష్ఠించుటకు వీలు వడలేదనియు, బ్ర॥శ్రీ॥ ఐలావరఘల వేంకటరమణార్యులు తమభక్తిశక్తులతో, తమ తపఃప్రభావముతో నిను (విగ్రహమును) పైకిలేపి

ప్రతిష్ఠించినారని చెప్పుకొనుట విని మేమాశ్చర్యము నొందుచున్నారము. సహజముగా నీ సౌందర్యము వర్ణనాతీతము.కోటి రతీమన్మథుల సౌందర్యము కూడా సరిపోనిది.)

**(Meanig :-OH! CHAAMUNDESWARI! We hear that the system or the way of setting up of your pious idol is the efficient cause of amazing experience. We are getting amazed when we have heard that it has become very hard to lift up your idol in general, and set it up in the temple as your idol is quite gigantic in size and heavy in weight, Brahmasree Ilavazzula venkata ramanaaryulu garu with his pious power of his devotion and penance has lifted up the idol and got it set up in the temple. Naturally your beauty is indescribable. Even the beauty of one crore pairs of RATHIMANMADHA (MANMADHA, the God of Love. RATHI, consort of MANMADHA) also do not suit to yours. )**

77. సీ ॥ నీ చూపు మధురంబు, నీ శ్వాస మధురంబు,
నీ నవ్వు మధురంబు, నీలవేణీ !
నీ వేణి మధురంబు, నీ పూలు మధురంబు,
పెదవులు మధురంబు నుదురు గూడ !
నడిచినా మధురంబు,ఒడలెల్ల మధురంబు
నిలిచినా మధురంబు నిన్ను జూడ !
నీయాట మధురంబు, నీపాట మధురంబు,
నీమాట మధురంబు, నెనరుగూర్ప!

తే.గీ ॥ మధురగుణమును తెలుపంగ మధురవగుచు
మాకు జూపితి నిలువెల్ల మధుర మూర్తి !
నీవు మధురంబు, మధురంబు నీదు చరిత !
“ చిత్రమధురంబు ” చాముండి చిటుకులందు !

(భావార్థం :-ఓ చిటుకుల నివాసినీ ! నిన్ను దర్శించిన భక్తుడు పరమానందమున బొంది ఆశ్చర్యచికితుడై నీ సౌందర్యమును ఒక్కొక్క అంశమును సందర్శించి తన్మయత్వమును చెందుతాడు! నీ చూపు (కన్నులు) మధురము. నీ శ్వాస(నాస) మధురము.నవ్వు,వేణి, పూల మాల, పెదవులు,నుదురు,నడక, తనువు,నిలకడ, నీ స్వరూపము, ఆట,పాట,మాట అన్ని మధురమే.మధురగుణమును, తెలియ చేయుటకు నీవే మధురమూర్తివై నీ నిలువెల్ల మధురగుణమును నింపుకొని మాకు జూవుచున్నావు. నీవు మధురము, నీ చరిత మధురము, నీ శిల్పము(చిత్రము) మధురము. సర్వము మధురము. )

(Meanig :-Oh! The inhabitant of CHITUKULA village! The devotee, who has beholden you, would get ecstasied in corporeality with bliss being amazed or stunned, having witnessed every portion of your divine elegance. Your sight (eye-glance) is divinely delectable, your breathing is sacredly scrumptious, your smile, braid, garland of flowers, lips, forehead, walking manner, steadiness or constancy, your mien , play or sport and your singing, all are very eternally luscious. In order to reveal the quality or the disposition of your heavenly and harmoniously flavorsome, you, having become 'the embodiment of delightful and venerable voluptuousness' by filling all the pleasant magnetism into you, are thus showing us. You are sanctimoniously serene-succulent and your history is saintly enticing to all the devotee-folk. Your art is gorgeously charismatic. Your entirety is enigmatically charming. )

78. కం ॥ మోహన మూర్తివి, తారవు,
నూహల కందవు, నొకవిధి-ఒప్పులకుప్పా !
ఆహా ! ఏమని పొగడను

ఐహికదూరవు నిజముగ నాముష్మికవై !

(భావార్థం :-ఓ ఒప్పులకుప్పా ! నిన్నేమని పొగడను? భౌతిక జీవితములో నీవు మాతోనే ఉంటూ మాకు సహకరిస్తూ నీ ఆముష్మిక తత్త్వమును తెలియజేస్తూ మమ్ము క్రమక్రమముగా మోక్షమువైపు, కైవల్యమువైపు తీసికొని పోవుచుందువు కదా ! కనుకనే తారాదేవివని కీర్తివడిసినావు కదా ! మోహనమూర్తివై మా కనులలో వెలుగొందు చుందువు కదా ! )

(Meanig :-Oh! OPPULA KUPPA! A heap of elegance and grace in other words 'the embodiment of sheer aptnesses! How do I praise you? By being with us, in our routine material life, indeed you, while cooperating us with sustenance and revealing us the philosophy of your spirituality, are taking us, in order, towards the very beatitude and the eternal happiness. Thereby, you verily gained the glory as TARAA DEVI. Indeed, you be on shining in our very eyes as fascinating form.)

79. కం ॥ నిన్నిట తెలియగ జనులకు

నన్నిటికంటెను నిజముగ నాముష్మికమౌ

సన్నిధి కావలె- ముంగిట

పెన్నిధివై బ్రోచు నిన్ను పెర లెరుగుదురా !

(భావార్థం :-ఓ తారకేశ్వరీ ! నిన్నర్థము చేసికొనుటకు భక్తులకు ముందుగా భౌతికజీవనముకంటే పైస్థాయి గలిగిన ఆధ్యాత్మిక భావన మనస్సులో కలుగ వలెను. దాని ప్రభావమున మనస్సు పవిత్రమై, జీవనము పవిత్రమై క్రమక్రమముగా ఆముష్మిక స్థాయి అలవడును. ఆ స్థితికి చేరుకొనుటకు భక్తులు నీ నిత్య పూజా ధ్యానాదులు ఆచరించవలె కదా ! )

(Meanig :-Oh! THAARAKESWARI! In order to comprehend you, spiritual perception or consciousness is to

be the first of all begotten in the hearts of devotees which is higher stage from mundane life or mere existence. With the influence of that, hearts get pious, life becomes pious and in order the stage of spirituality gets accustomed. In order to reach such stage indeed the devotee-folk have to observe your perpetual worshipping and of meditation etc. as well.)

80. కం ॥ కొనుమమ్మా మా నతులను,
వినుమమ్మా మా నుతులను, వెంటనె నిటకున్
చనుదెమ్మా-మమ్ము మనుప,
కనుమమ్మా చల్లనైన కనుచూపులతోన్ !

(భావార్థం :-ఓ శాంతస్వరూపిణీ ! మా ప్రార్థనలను వినుమమ్మా ! మానమస్సులను చేకొనుమమ్మా ! మా సాన్నిధ్యమునకు చనుదెంచుమా ! మమ్ములను కాపాడుమమ్మా ! నీ చల్లని చూపులతో మమ్ము కనుగొనుమమ్మా ! )

(Meanig :-Oh! The embodiment of peace and tranquility! Kindly hearken to our prayers! Kindly accept our obeisance. Please proceed to our proximity! Protect us! Perceive us with your pious benign-glances.)

81. కం ॥ వందలు వేలుగ భక్తులు
చిందులు వేయుచు గుడికడ జేరగ రాగా
అందరు గూడుచు జాతర
నందముగా జేతురమ్మ హారతు లిడుచున్ !

(భావార్థం :-ఓ చిటుకుల గ్రామదేవతా ! పరిసరప్రాంతవాసులు భక్తులందరూ ప్రోగై,వందల వేలుగా కలిసి, నీ గుణములను గానము చేయుచూ, భజనలు చేయుచూ, చిందులువేయుచూ, నీ దయాగుణమును వేనోళ్ళ పొగడుచూ, ఉత్సాహముతో,సంతోషముతో,ఆనందముతో ఉ

త్సవములు చేయుచూ, చేయించుచూ నీ మందిరముకడ కేగుదెంచి జాతర నిర్వహించగా ఆ చైతన్యపూర్వక కార్యక్రమములను తిలకించినచో,ఆ ఆనందము హారతులిచ్చునపుడు కనుగొన్నచో–ఓహో ఒడలెల్ల పులకించి పోవును గదా! )

**(Meanig :-Oh! The deity of village CHITUKULA! May hundreds and thousands of your devotees of the neighborhood, having gathered themselves, when go on singing the virtuous attributes and go on worshipping you accompanied by music, go on dancing a jig, extolling the attributes of your benignity with a thousand mouths with jollity when go on celebrating festivities and getting or seeing them celebrated by others, having arrived or proceeded to your MANDHIR, if we behold at such conscious-provoking programmes, when we perceive you at the times of offering times, the entire body of us feels bristled indeed.)**

82. కం ॥ ఆర్భాటము లేకనె–సం
దర్భానుసారము నీవు దర్శన మీయన్
దర్పోద్భవాది హాటక
గర్భులు కీర్తించిరమ్మ కనుగొని నిన్నున్ !

(భావార్థం :–ఓ త్రిమూర్తి స్వరూపిణీ ! నీ అవతార మహిమను పొగడశక్యమా ! ఎప్పుడు ఏరూపమవసరమో, ఏ శక్తి అవసరమో అలా నీవు సందర్భానుసారము నిరాడంబరముగా అవతరించుచూ ఆయా దేవతల కోరికలగు, ప్రకృతిరక్షణకై చేయుచు అందరిని సంరక్షించు నీ కరుణాకర కృత్యములను మనస్ఫూర్తిగా అందరూ కీర్తించిరి గాదా ! )

**(Meanig :-Oh! The embodiment of the Hindu-triad (BRAHMA (The Creator), VISHNU (The Sustainer) and MAHESWARA (The Destroyer))! Is it possible for us to**

extol your miraculous greatness of your incarnation? When, and which form is needed, which energy or potency is needed thus you in accordance with the situation without 'pomp and ado' go on incarnating yourself and thus accordingly go on meeting the needs of the deities in accordance with their intentions (desires) for the protection of the very nature, and go on rearing or patronizing all, with your very merciful deeds, those having been very much heartfelt, for which and for all such all the people have indeed extolled you so! )

83. ఉ ॥ దానవజాతి పెచ్చురిలి ధర్మసమాజపు జీవితానికిన్
హాని ఘటించుచో, బగళ !హైందవపద్ధతి క్షీణమైనచో,
మానవసంఘనాశ మయి-మన్నికలేదను పట్టులందునన్
దీనులగావగాను-నరుదెంతువు నీవయ చక్కదిద్దగాన్ !

(భావార్థం :-ఓ బగళాదేవీ ! నీవు శత్రు సంహారిణివి.దుష్టశక్తి సంఘాతినివి కూడ ! ప్రకృతిలో ఎల్లప్పుడు దానవజాతి మానవ మనుగడకు అపకారము తలబెట్టుచునే ఉండును.ధర్మవినాశనము సృష్టించుచునే యుండును.ప్రశాంత జీవనమునకు ఉపద్రవము కల్గించుచనే యుండును. అలాంటి విపత్కర భీకర సమయములలో నీవు అవతరించి,దీనావస్థలో నున్న మానవజాతిని ఉద్ధరించు బాధ్యతను స్వీకరించి,దుష్టదానవరాక్షస కృత్యములను పరిహరించి ,ధర్మమును ప్రతిష్ఠించి,ఆర్ష జీవనమును చక్కబరిచి,శాంతిస్థాపన మొనరించి సర్వజీవులను పోషింతువు.)

(Meanig :-Oh! BAGALA DEVI! The embodiment of multiplicities! You are the destructor of our foes, the slayer of the strength of wickedness. In nature, forever 'DAANAVAAS' (the evil-powers) wish on harming the existence of human beings and they go on creating the destruction or annihilation of pious-virtues. They go on

causing affliction or annoyance to peaceful lives. In such queer and opposite and frightful times, you having incarnated yourself, having taken the responsibility of sustaining or rescuing and upholding the human race that's in the poor-plight of wretchedness, having removed the wicked activities of DAANVAAS, having installed the virtue, and having set right the prophetical life by establishing the peace and tranquility, go on sustaining all the creatures.)

84. సీ ॥ కార్యంబు నెరరవేర్ప కాంక్షించు భక్తులన్
దరిజేర్చి తనుపుదు తారకాక్షి !
శాంతికై తపియించు సాధులన్ గాపాడి
సంతోష మొసగెదు సారసాక్షి !
ఆర్తుల బోషింప నారాటపడువారి
కాశ్రయం బిడెదవో అంబుజాక్షి !
ధర్మంబు రక్షింప తాపత్రయము నొందు
కార్యకర్తల బ్రోతు కైరవాక్షి !

తే.గీ ॥ భువిని వేదాంతబోద్ధలన్ బ్రోతు వెపుడు,
తివిరి పురుషార్థ పద్దతుల్ తెలుపు దెపుడు,
భక్తి భావంబు పెంతువు ప్రజల కెపుడు,
నీదు నవతార మర్మంబు-నిదియకాదె !

(భావార్థం :-ఓ తారకాక్షీ ! కార్యోన్ముఖులై స్వకర్మవరాయణులౌ కర్మిష్ఠులను సదా కాపాడుచు విఘ్నములనెల్ల తొలగించి సంతోషపెట్టెదవు. ఓ సారసాక్షీ ! సమాజములో శాంతిస్థాపనకై పరితపించు సాధు సజ్జనులను ప్రోత్సహించి వారికి చేదోడు వాదోడుగా నుండి సహకార మందింతువు. ఓ అంబుజాక్షీ ! ప్రకృతివైపరీత్యములచే నానా కష్టములనుభవించువారి ఆర్తి పోగొట్టుటకై ఆరాటవడువారికి

ఆశ్రయమిచ్చి ప్రోత్సహింతువు. ఓ కైరవాక్షీ ! ధర్మరక్షణకై సర్వాత్మనా పరిశ్రమించు ధార్మికులను ప్రోత్సహించుచూ ధర్మసంస్థాపన మొనరింపజేతువు. వేదాంత బోధకులకు తోడ్పడెదవు. చతుర్విధ పురుషార్ధ సాధనకై పద్ధతులను వివరింపజేతువు. ఈ విధముగా సమాజశ్రేయస్సుకై భక్తి భావప్రేరణకై నీవు దృశ్యాదృశ్యమూర్తివై నీ అవతార ప్రయోజనమును నెరవేర్తువు.)

**(Meanig :-OH! THARAKAKSHI! , the one that possesses innumerous stars as her eyes! You, having removed the obstacles or hindrances from the lives of your devotees, propitiate them, the staunch doers those who are inclined sincerely towards performing their deeds or duties (KARMA) only. Oh! SAARASAAKSHI! You extend your assistance or sustaining to the recluses, sages and good people those who are anxious for the establishment of peace and tranquility in the society being with them as a helper or social companion, having encouraged them by all means. Oh! AMUBUJAAKSHI! In order to remove or expel the distress, You having given your prop or refuge and encourage to the people who incessantly go on striving harder in removing the grief of the people who are badly experiencing many afflictions and hardships due to the natural calamities. Oh! KAIRAWAVKISHEE! Having encouraged/ on encouraging the pious people who go on striving soulfully for the very protection of DHARMA (virtue/treatise/system) you see DHARMA established thus, through them. You help and sustain the preachers of VEDAANTHA (the essence and 'ens' or philosophy of VEDAAS). You reveal the methods or practices of achieving CHATHURVIDHA PURUSHAARTHA (the way to ob-**

**serving DHARMA, earning money (ARTHA), connubial life (KAAMA), and accomplishing the beatitude (MOKSHA). Thus, for the safety of society, for the inspiration of devout-deposition. You, having become the embodiment of both the visibility and the invisibility, thus you fulfill the very purpose of your incarnation.**
**(extra : Oh! THAARAKAAKSHI! The incliner of deeds! Who are inclined to their personnel deeds, like the fellows who are earnest in the performance of the rites of their own religion or they, who bound by the doctrine of works).)**

**85.** ఉ ॥ చేతికి నందినట్టి ఒక చిన్న కణంబది వెంటనే ఛళా !
మూతికి చేరుచున్ ఒకట మోదముగూర్చుగ నీ కృపాదృశుల్
హేతువటంచు నెంతుమది, ఎంతటి వారికిగూడ,నీరమున్
నూతిని ద్రావ దా లతయు, నోటికి చేరదు చేతి కూడుయున్!

(**భావార్థం :-**ఓ చాముండేశ్వరీ ! మానవుండెంత సమర్థుడైననూ భక్తిభావశూన్యుడై అహంకరించినచో వాని కృషి నిష్ఫలమగునని అప్పుడప్పుడు,ఆశ్చర్యకర సంఘటనల ద్వారా నీవు హెచ్చరించు చుందువు.చేతికందిన ఒక చిన్న కణము కూడా నోటికి చేరుటలో ఎన్ని అవాంతరములు ఏర్పడునో ఊహింపజాలము.అమ్మ దయ ఉన్నచో ,ఆమె కృపావీక్షణములున్నచో సంపాదించిన దానిని సంతృప్తిగా ననుభవింపజాలుదుము.స్వయంకృషి సఫలమగును. బావిప్రక్కన మొలిచిన తీగ తనంతతాను బావిలోని నీరును త్రాగజాలదు. అమ్మ దయతో ప్రకృతి సహకారముతో నీటిని అందుకొనకలుగును. కనుక ప్రతిక్షణము అమ్మ నామస్మరణము అవశ్యమననీయము ! )

**(Meanig :- OH! CHAAMUNDESWARI! Off and on you go on warning us with your amazing occurrences that a human whatever else, is talented if be, being destitute of**

devotional disposition, arrogates with presumption, his exertion or labor will go in vain. A morsel or a particle that's in hand in reaching to the very mouth, how many obstacles or hindrances take place, we can't even imagine. We can only enjoy ourselves what we have earned with contentedness only if we have had Her mercy upon us and her kindness along. Then only one's own personal effort or self-culture will be successful or efficacious. A tendril or a creeping that sprouts up by itself beside a well can't drink water of the well. It can only receive its water with the kindness of 'Mother' and with the co-operation of the nature. So recollecting or contemplating the epithets of Mother is indeed essential for all.)

86. కం ॥ నీవొక మహోన్నతాంబవు
దైవిక శక్తులు, కవియగ-దర్శన మీయన్
దీవెన లీయన్,చిటుకుల
జీవులగావన్, వెలిసితి చింతామణిరో !

(భావార్థం :-ఓ చింతామణిరో ! సకల దేవదేవతలూ తమతమ రూపులు మార్చి కేవల తేజఃస్వరూపమును ఏర్పరచి అంతా ప్రకృతి మయంచేసి,అందులో నుండి ఏకీకృత శక్తి స్వరూపమును ఆవిర్భవింపజేసి,తమ ఆయుధములనన్నింటినీ (శస్త్రాస్త్రములను) ఆ శక్తికి అధీనముచేసిన పిదప- సర్వదానవరాక్షస దుష్టాసుర దుర్మార్గులను సంహారించుటకు ఉద్భవించిన ఓ చాముండేశ్వరీ ! నీవు మహామహోన్నతాంబవు! ఆ నీ దివ్యరూపమును శ్రీ ఐలావఝల వేంకటరమణాచార్యులు ఉపాసించి విగ్రహరూపమున ప్రతిష్ఠించినందున భక్తులమైన మాకందరకు నీ దర్శనభాగ్యము కలిగినది.నీ ఆశీస్సులందుకొను నదృష్టము కలిగినది కదా ! )

(Meanig :-OH! The very CHINTAMANI! You're like

**the wish-yielding-gem that furnishes the possessor 'all that he/she craves for or wishes'. The community of all the Gods and the deities, having altered or transformed their original silhouettes, having set up their sheer potential forms, having added them into the nature form to very it, having created the united or conjoined form of their potencies and having submitted the control of all their divine weaponry to that form of energy -Oh! CHAAMUNDEE! The Goddess who attempts annihilating or terminating all the wicked ASURAAS, the evil-powers. You are the Divine Mother of all mothers, the elevated loftiness. Since SRI IRAAVAJJULA VENKATA RAMANACHAARYA, having observed UPASANA (worshipping) of your divine form, when have installed your eternal image, in the form of pious idol, we, your devout-folk have got fortune to have your divine sight. We verily have the opportunity to receive your blessings thus.)**

**87. సీ ॥ చాముండి ! నీపాద సరసిజ యుగళంబు**
**పూజింప మాకెట్లు బుద్ధి వుట్టు ?**
**జోగుళా ! నినుజూడ జోగిపేటకు బోవ**
**నూర్మొన్న మాకెట్లు కోర్కెలుగు ?**
**పదునెనిమిది భుజపంక్తులన్ దర్శింప**
**శ్రీదేవి ! మాకెట్లు చిత్తమగును ?**
**ఆజానుబాహవౌ ఆకారముగన ప్ర-**
**త్యంగిరా ! మాకెట్లు నానవౌడము ?**

**తే.గీ ॥ విచ్చుకొన్నట్టి పద్మంపు పెద్దకళ్ళు**
**వెన్నెలల నీను శశివంటి విశదముఖము**
**బింబఫలముల బోలెడు పెదవియుగళి**

వచ్చి చూచుట నీ యాన వలనగాదే !

(భావార్థం :-ఓ సర్వదుష్టశక్తి సంహారిణీ ! జోగిపేట మండలం చిటుకులగ్రామ సమీపాన మంజీరానది తీరాన ప్రతిష్ఠితమైన నీ సుందర విగ్రహరూపమును సందర్శించి ఆనంద పరవశులమగుటకు మాకు సంకల్పము కలుగవలెనన్ననూ,అచటకు రావలెనన్న నూ ప్రత్యక్షముగనో పరోక్షముగనో నీ అనుగ్రహము ఉండవలెనమ్మా ! ఓ చాముండి! నీ పాదపద్మములను పూజించుటకు మాకు బుద్ధి ఎలా కలుగునమ్మా ఓ జోగులాంబా ! జోగిపేట నమీపవర్తినివైన నిన్ను చూచుటకు మా మదిలో కోర్కె కలుగవలెనన్న నీ ప్రేరణ ఉండవలెనమ్మా ! ఓ ప్రత్యంగిరా ! నీ ఆజానుబాహు విగ్రహ సౌందర్యవీక్షణము సామాన్య మానవులమౌ మాకు లభ్యమగునా ! నవవికసితకమలాక్షులను,శరచ్చంద్ర చంద్రికా దీప్తవదనమును, బింబఫల సదృశా ధరయుగళిని తనివిదీర వీక్షించి తన్మయత్వముచెందుట నీ అనుమతితోనే సంభవించునుగదా ! )

(Meanig :- Oh! The annihilator of all the evil-powers! We should verily have your kind favor either directly or indirectly either in getting the will to visit your holy idol installed on the banks of the river MANJEERA near the village CHITUKULA in JOGIPET MANDAL to be ecstasied or to come over there. Oh! CHAAMUNUDEE! How do we get pious-intension to worship your flowerier-feet? Oh! JOGULAMBA! Your inspiration or encour-agement is a must for us in our hearts to get a craving to see you, who abide, walk within the proximity of JOGIPET. Oh! SREEDEVI! The deity of embodiment of all the wealth and wisdom! How do we get in our minds the desire of visiting the very form of your embodiment of the divine power with eighteen-armed range, com-posed with the heavenly weaponry! Oh!

PRATHYAMGEERA! Can we, being common-folk get an opportunity of viewing the elegant beauteousness of your longimanus-idol (arms reaching knees)? It will indeed be occurred certainly with your permission only to see to our repletion or satiety, with a feel of corporeality, the freshly blossomed lotus-like eyes of yours, the effulgence of moonlight of the autumnal moon like face of yours and the pious pair of your rosy or ruby lips!)

## "సంస్కృత శ్లోకాలు"

88. వసంత తిలకం ॥ శ్రీజోగిపేట నిలయాం జగదీశ్వరీం, శ్రీం
అష్టాదశాధ్య భుజపంక్తిధరాయుధాం, హ్రీమ్ ।
ధర్మార్థకామ పురుషార్థ విముక్తిదాం క్లీం ।
చాముండిపీఠ భగలాం మనసా స్మరామి ॥

(భావార్థం :-జోగిపేట సమీపగ్రామమున నిలయము నేర్పర్చుకొన్న శ్రీంకార రూపిణిని,జగదీశ్వరిని,పదునెనిమిది భుజపంక్తియందు శస్త్రాస్త్రములను ధరించిన హ్రీంకారశక్తిని, ధర్మార్థకామమోక్షములను,-నాల్గు పురుషార్థములను-భక్తులకొసంగు క్లీంకారదేవతను భగళా మాతను,చాముండీ పీఠమున ప్రతిష్ఠింపబడిన త్రిశక్తి మూర్తిని మనసా స్మరించుచున్నాను.)

(Meanig :-I'm heartily recollecting the deity, the embodiment of SHREEM (the seed-syllable that represents the Divine MOTHER) who has made her 'abode' in the proximity of the village, CHITUKULA in JOGIPET MANDAL, the empress of the universe, the embodiment of potency of HREEM (the seed-syllable that represents the Divine MOTHER) who is eighteen-armed, composed with the eternal-weaponry, the deity, the embodiment of KLEEM (the seed-syllable that represents the Divine MOTHER), the BAGALA, the embodiment of all mul-

tiplicities who endows her devotee-folk with the gratification of desire, acquirement of wealth discharge of duty and final beatitude (emancipation)which are called the four major or principal objects in life, and the embodiment of power of the trinity who's installed at CHAMUNUDEE PEETAM (seat). )

89. శా ॥ సాలగ్రామశిలాభవాం,సురుచిరాం,దేదీప్యమానాంగదాం,
దివ్యజ్యోతితనుం, భజే, త్రిజగతీ సంరక్షణాధీశ్వరీమ్
ఐలావర్ఝుర్ఝుల వేంకటార్యరచితాం, -అష్టాదశాఢ్యాం,-కరాం
ఐంహ్రీం క్లీం మనుపూజితాంచితపదాం, శ్రీమంత్రపూతాత్మికామ్।

(భావార్థం :-శ్రీ చాముండేశ్వరి విగ్రహము సాలగ్రామ శిలను తొలిచి కమనీయముగా శిల్పులు చెక్కినారు. వారికి మూర్తి స్వరూపమును శ్రీ ఐలావఝ్ఝల వేంకటరమణార్యులు రూపురేఖలను గీసి చూపినారు. శ్రీశర్మగారి ఉపాసనా బలముచే, తపఃప్రభావముచే విగ్రహమున దివ్యజ్యోతి దేదీప్యమానముగా వెలుగుచున్నది.చండముండాసురులను సంహరించుటకు వెలసిన చాముండీ నిజస్వరూపము సాక్షాత్తు ఈ విగ్రహమున ప్రతిబింబించుచున్నది.అష్టాదశభుజవంక్తిధృత శస్త్రాస్త్రములు,త్రిజగతీ సంరక్షణ కార్యోద్యమము, ఐంహ్రీంక్లీం మహామంత్రశక్తి వెలుగొందుచున్నవి.)

(Meanig :-The sculptors have quite gracefully chiseled the idol of SHREE CHAMUNDESWARI DEVI, out of the sacred SALAGRAM (a naturally-carved stone-piece of specific deity by the friction of flowing of water along, that's available on the banks of sacred rivers).SHREE ILAVAJJULA VENKATA RAMANAARYULU GARU, having drawn the real nature and semblance of the image (of its shape or the natural form or state or condition and purpose) showed the

**sculptors. By the efficaciousness or influence of SHREE SHARMA'S worshipping and his power of penance with majesty and magnanimity, in the idol, the divine radiance is splendidly or gloriously shining. The original form of CHAAMUNDEE reflects manifestly in this very image, who has incarnated to annihilate the ASURAAS called CHANDA and MUNDA, the evil-powers. The range of eighteen mighty-arms, contained with heavenly weaponry, the guardianship of the three universes, attempting the pious deed of guarding IIM, HLEEM and KLEEM (the syllable-seeds, BEEJAKSHARAAS) and the power of sacred hymns, are shining in the very idol.)**

**90. అనుష్టుప్ ॥ లక్ష్మీవాణీ మహాకాళీ శక్తిత్రయాత్మికాం,శివామ్ ।**
**చిటుకుల మహాపీఠే, చాముండీశాం భజామ్యహమ్ ॥**

**(భావార్థం:-జ్ఞాన,ఇచ్ఛా,క్రియా శక్తులకు అధిష్ఠాత్రులైన లక్ష్మీసరస్వతి,కాళీ రూప త్రిశక్తుల సమాహార అధిదేవతవైన ఓ చాముండీదేవీ ! చిటుకుల మహాపీఠము నందు అధిష్ఠాత్రివై పూజలందుకొని భక్తుల కోర్కులు దీర్చుచున్న నిన్ను సేవించుచున్నాను. )**

**(Meanig :-Oh! CHAAMUNDI DEVI! The tutelary deity of the united form of three pious powers, representing LAKSHMI, SARASWATHI and KAALI who are the presiding deities of the powers of wisdom, inclination and action respectively! I'm serving you in worship that, having presided over the great-seat (annals) of CHITUKULA, is receiving incessant worship and fulfilling the wishes of votaries.)**

**91.అనుష్టుప్॥ అష్టాదశ భుజాఢ్యాం,హ్రీం,శస్త్రాస్త్రాద్యైస్సమన్వితామ్**
**మహోన్నతాం,మహాబాహుం,మహా సారాం,స్మరామ్యహమ్ ॥**

(భావార్థం:-పదునెనిమిది భుజపంక్తియందు శస్త్రాస్త్రములు ధరించి, మహోన్నతమైన సాలగ్రామ శిలారూపమునందు మనోహరమైన ఆకారమున,మహాబలసార సమన్వితవై వెలసిన చాముండేశ్వరీ నీకు నమస్సుమాంజలులు.)

(Meanig :-OH! CHAAMUNUDEE! My devout obeisances to very you who, having worn the eternally divine-weaponry in eighteen mighty arms with magnificent shapeliness in quite an amazing stone form of magnanimous piece of SAALAGRAMA, have appeared in compilation with the essence of the gigantic genuine power.)

92. అనుష్టుప్ ॥ మాతృకాబీజ వర్ణాఢ్యాం,సర్వమంత్ర సమర్పితామ్ ।
దుష్టశక్తి విఘాత్రీం క్లీం, హృదా సదా జపామ్యహమ్ ॥

(భావార్థం :-మాతృకాబీజ వర్ణ సంఘటితమైన మంత్రస్వరూపిణివి ! సర్వమంత్రసార సమన్వితవు. దుష్టదానవశక్తి విఘాతినివై, క్లీంబీజ సమన్వితమైన మంత్ర సంపుటితో జపింపబడుచున్నావు. )

(Meanig :-You are the embodiment of the compilation of the base-rooted sacred seed -syllables (IIM, HREEM, KLEEM...etc.) You, the union of the essence of all the chants! You, the destructor of the power of the wicked DAANAVAAS, the evil-powers. You are devoted, meditated and repeated with the anthology of sacred spells united with the pious seed-syllable KLEEM.)

93. అనుష్టుప్ ॥ సాలగ్రామశిలాజాతాం, శ్యామవర్ణాం, వినీలభామ్ ।
శరత్కాలే హృదా ధ్యాయే, శ్రీదేవీం శక్తిరూపిణీమ్ ॥

(భావార్థం :-సాలగ్రామశిలావిర్భూతమైన దేవీ స్వరూపముతో శ్యామవర్ణముతో, వినీలకాంతితో,శ్యామలాదేవిగా కీర్తింపబడుతూ, శరత్కాలనవరాత్రులలో విశేషపూజలందు కొనుచున్న శ్రీ దేవిని

శక్తిస్వరూపిణిని నిన్ను హృదయమునందు ధ్యానించుచున్నాను. )

93. From the core of my very heart, I adore the very you, the one, who having manifested herself in the form of the sacred stone of SAALAGRAAMA with the dark complexion with bluish lustre and who is being extolled as SYAAMALA DEVI, during the nine precious nights of autumnal season and who is receiving the distinguished worshipping as the deity SREE DEVI, the embodiment of the ultimate power and potency, all the riches and fortunes of all the universes.

94. శా ॥ శ్యామాంగీం, కమలాయతాచ్ఛ వదనాం, సౌవర్ణభూషోజ్జ్వలాం,
రక్తాభాంబరభూషితాం, త్రినయనాం, అష్టాదశాఢ్యాం కరామ్।
శ్రీ చక్రాంచిత మంత్రబీజ సుతనుం, శక్తిత్రయాత్మికాం,శివాం,
త్రైలోక్యాధివసద్భి రీశసుముఖై రారాధితాం, శ్రీం భజే ॥

(భావార్థం:-శ్యామాంగముతో, విరబూసిన కమలమువంటి విశాలమైన స్వచ్ఛమైన వదనముతో,నానావిధ సువర్ణాభరణముల కాంతితో, ఎర్రని రంగు గలిగిన పట్టువస్త్రముతో,త్రినేత్రములతో, పదునెనిమిది భుజ పంక్తిధృత శస్త్రాస్త్రములతో శ్రీచక్ర కేంద్రబిందుగత మూల బీజాక్షర తనువుతో,త్రిశక్తి సంపుటిత ఏకాకారముతో,త్రిలోకవాసులందరిచేత సమరవిధానముతో పూజింపబడు శ్రీంబీజాధివాసినిని, శివశక్తిని, నిన్ను మనసా పూజించు చున్నాను.)

(Meanig :-I'm heart-fully and verily worshipping you, the deity who is with the dark bluish body with the pure face adorned with blooming spacious eyes like the flower lotus, with the effulgence of all sorts of the golden ornaments, embellished with reddish silk-raiment, with three eyes, with eighteen mighty arms range, in order, adorned with the divine-weaponry, with the body of the base-

rooted sacred spells of the centre of the cipher representing the mien of the the seed syllables, the BEEJAAKSHARAS of the pious SHREE CHAKRA, with the unique beau of the tri-powered folded from who is worshipped with equable ordinance by all the inhabitants of the three worlds(The Heaven, The Earth and The Hell) or the universe as the governing deity or abode of the sacred letter (the seed syllable) 'SHREEM, the pious power of Lord Shiva!)

95. శా ॥ చాముండీ,మసురాది శత్రుమథినీం, బ్రహ్మాండభాండోదరీం,

నక్షత్రాది నవగ్రహాది, కకుభాధీశాది లోకాధిపామ్ ।

నానాజాతి సమర్చితాంహిం, శ్రీ చక్రధామేశ్వరీం,లయే ।

కీటబ్రహ్మాహ్యాదిస్థ చైత్యకలనాం, చైతన్య జీవాత్మికామ్ ॥

(భావార్థం:–శ్రీచక్రధామేశ్వరీ ! నీవు చాముండివి.దుష్టదానవాసుర రాక్షస శత్రు సమూహమును నాశనము చేయుదానవు. బ్రహ్మాండభాండముల నన్నిటినీ నీ ఉదరమందు ధరించినదానవు, నక్షత్ర,నవగ్రహ,అష్టదిక్పాలక చతుర్దశలోకాధిపులను పాలించుదానవు. నిన్ను పూజించుటకు ఏతెంచిన నానాజాతి భక్తులచే సమరభావముతో అర్చింపబడుదానవు.శ్రీచక్ర సంపూజితవు.చీమలో బ్రహ్మలో ఏకవిధముగా చైతన్యమును నింపిన దానవు.నీకు మన:పూర్వక నమస్సులు ! )

(Meanig :-Oh! SHREE CHAKRA DHAANESWARI! (The sovereign of the abode of SHREE CHAKRA and tutelary deity), you are the very CHAAMUNDEE, the destroyer of all the groups of the wicked DANAVA-folk, the evil-powers, you are the wearer of the vessel of the all the universes in your very belly! You are the ruler of the stars, the nine planets and the rulers of the eight directions and the fourteen universes you are worshipped with the impartial disposition by all the devotees who

come to worshipping you. You are revered by the pious 'SHREE-CHAKRA'; you are the filler of the consciousness in an ant and Brahma alike! To you, such the one, my heart-full obeisance indeed pertain.)

96. వసంత తిలకం ॥ జ్యోతిస్వరూపకళికాం,సకలాత్మదీప్తిం,
నిత్యాఖ్య షోడశకలాత్మిక యోగినీం క్లౌమ్ ।
శ్రీచక్రబిందుగతనాద కలాస్వరూపాం,
దేవీం భజామి సతతం భవబంధ ముక్త్యై ॥

(భావార్థం:-భక్తుల హృదయకుహరములో వెలుగు జ్యోతి కళికా స్వరూపవు,సకల జీవాత్మలలో ప్రకాశించు దీపకాంతివి, షోడశ తిథినిత్యాఖ్యల రూపిణివై వెలుగు శుక్ల కృష్ణపక్షద్వయ యోగినీ దేవతవు, క్లౌమ్ బీజాక్షర దేవతవు, శ్రీచక్రబైందవ స్థానగత నాదబిందు కలా స్వరూపిణివి, ఐన నిన్ను భవబంధ విముక్తి కొరకై సతతమూ భజించుచున్నాము. )

(Meanig :-You are the embodiment of the flame of illumination that shines on, in the very core of the hearts of devotees. You are the lustre of light, shining in all the living beings. You being the mien of the sixteen epithets or appellations of lunar days those shine as both the pair of black and white female mendicant deity. You are the tutelary deity of the sacred spell KHOUM (seed-syllable). You are the embodiment NAADHA, BINDHU and KALAA grounds of positions, for such a deity, to the very you, for the redemption from mundane ties forever we extol and adore accompanied by the divine-music.)

97. మందాక్రాంతం ॥ధర్మాధారా, మగణితగుణారేనౌమి,భక్తార్చితాంఘ్రీం,
పద్మాక్షీం, హ్రీం,చిటుకుల జనావాస సంజాతరూపామ్ ।
దేవేంద్రాద్యై రమరవర సందత్త శస్త్రాస్త్ర శక్తిం,

కామక్రోధాద్యరిగణ వినాశాయ సంధత్తమూర్తిమ్ ॥

(భావార్థం:-ఆర్షధర్మమునకు ఆధారభూతురాలవు,సకలసుగుణ గణనిలయవు.సర్వభక్తుల చేత పూజింపబడు పాదపద్మద్వయము గలదానవు, విచ్చిన కమలములవంటి కనుదోయిగలదానవు, హ్రీం బీజాక్షరదేవతవు, చిటుకులగ్రామ సమీపాన మంజీరానదీ తీరాన ప్రతిష్ఠింపబడి పూజలందు కొనుచున్నదానవు, సకల స్వర్గవాసులైన దేవేంద్రాది దేవతలచేత తమతమ శస్త్రాస్త్రములు సంప్రాప్తమైనదానవు,అంత:శత్రువులను,బహి:శత్రువును సంహరించుటకు అనుగుణమైన మూర్తివిగా అవతరించినదానవు యైన చాముండీ దేవిని నమస్కరించుచున్నాము.)

**(Meanig :-You are the basis of ARSHA DHARMA (spiritual or prophetical virtue), you are the abode of all the eternal attributes. The possessor of the lotus like pair of pious feet those are worshipped incessantly by all the deities. You are the container of the blooming eyes those resemble the very lotus. You are the guardian deity of the seed-syllable HLREEM who, having been installed in the proximity of the holy river MANJEERA, on its very bank, who are receiving the worshipping you are the one who's bestowed with all sorts of the divine weaponry possessed by all the dwellers of the heaven and DEVENDHRA and the other deities. I am offering my obeisances to such CHAAMUNDEEDEVI who has appeared herself as a pious form in accordance with the convenience to terminate all the internal and external foes! )**

98. మందాక్రాంతం ॥చండీం,దేవీం,త్రిగుణగణ కాళీరమా వాగధీశాం,

బ్రహ్మాదీనాం, త్రిజగదధిదేవేంద్ర సర్వేశ్వరీ మైమ్ ।

సర్వాధీశాం, సురతదితరేషాంచ లోకాంతరాణాం

చేతోరూపాం, దశదిశగతాం,చింతయే క్లీం సదాఽహమ్ ॥

(భావార్థం:-చండీదేవిగను, సత్వాదిగుణగణములకు అధిష్ఠానదేవతలైన మహాకాళీ మహాలక్ష్మీ మహా సరస్వతీ రూపిణివై ఏకదేవతగా అవతరించిన నిన్ను, సృష్టి స్థితి లయమునకు అధిష్ఠానదేవులైన బ్రహ్మావిష్ణుమహేశులకు,స్వర్గాధివాసులైన ఇంద్రాదులకును సర్వేశ్వరివైననిన్ను, ఐంబీజాక్షర మాతృకవైన నిన్ను,చతుర్దశభువన జాతులకు అధీశ్వరివైననిన్ను, చైతన్యరూపిణివైన, సర్వదిశావ్యాపినివైన క్లీంబీజాధిదేవతను సదా ధ్యానింతును.)

(Meanig :-I incessantly meditate on You, who have manifested being CHAMUNDEE DEVI and being the unified embodiment of MAHAKALI (an epithet of PARVATHI, consort of SHIVA (KALA)), MAHA LAXMI, the Goddess of auspiciousness and all the wealth and prosperity, and MAHA SARSWATHI (an epithet of SARASWATHI, the Goddess of word and speech), the tutelary deities of all the assemblages of attributes of truth and amiability, the empress of the governing Gods of the Creation, the Sustenance and the destruction, BRAHMA (the Creator),VISHNU (the Sustainer) and MAHESWARA (the Destructor), the supreme ruler of all the dwellers of the heaven, headed by INDRA (the breaker of the forts, the king of gods), who is the source of the sacred seed-syllable 'IM', who is the governing Goddess of all the living and non living beings pertaining to all the fourteen universes, who is the embodiment of the sheer-consciousness, the all pervading, who is the tutelary of sacred seed-syllable KHLEEM! )

99. మందాక్రాంతం॥చాముండీం, శ్రీం,చిటుకులభవాం,వేంకటార్యేణ నీతాం,

సాలగ్రామా ద్భువరుచిర సౌందర్య దివ్యాంగదేవీమ్ ।

సవ్యాసవ్యాం నవకరగతాష్టాదశాఢ్యాం భుజాంగీం,
సర్వారాధ్యాం, ప్రణతజన సౌభాగ్య భూత్యర్థ మీడే ॥

(భావార్థం:-శ్రీంబీజాధిష్ఠితవై, బ్ర॥శ్రీ॥ ఐలావఝల వేంకటరమణశర్మగారిచే చిటుకులప్రాంత మందిరప్రతిష్ఠితవై,సాలగ్రామశిలాభవశిల్పమై, సురుచిరసౌందర్య దివ్యాకారవై,కుడిఎడమల రెండుతొమ్మిదుల కరములందు (9+9=18)శస్త్రాస్త్రములను ధరించి,సర్వారాధ్యవై ప్రణతజన సౌభాగ్యప్రదవై ప్రశస్తినందుచున్న ఓ చండీశ్వరీ నీకు నమస్సులు. )

(Meanig :-Oh! CHAAMUNDEE, the governing deity of the sacred spell SHREEM (the seed-syllable), having been installed in the very MANDIR of CHITUKULA premises by BRAHMASHREE IRAVAJJULA VENKATA RAMANARYA SHARMA GARU, carved out of the sacred stone form of the pious SAALAGRAAMA , being the embodiment of the eternal beauty, having worn both the sides nine mighty arms holding divine weaponry, being 'the worshipped by all', being reputed as the bestower of the prosperity and wisdom to the pious people… to such CHAAMUNDEE, I offer my very obeisances to you!)

100. అనుష్టుప్ ॥ త్వయాదత్తం మహాదేవి! తుభ్యమేవహిదీయతే ।
భావ ః కర్మ చ కావ్యేఽస్మిన్-త్వదీయంహి, మమేతి న ॥

(భావార్థం:-ఓ మహాదేవీ ! నీ విచ్చిన కవితామర్థ్యముచే వ్రాసికూర్చిన కావ్యమును నీకే మరల సమర్పించుచున్నాను. ఈ కావ్యమునందున్న భావముగాని,రచనాప్రక్రియగాని అంతయు నీదే-నాదన్నదేమియు లేదు.)

(Meanig :-OH! MAHAA DEVI! Oh! Great Goddess! I'm concentrating on you again this treatise compiled, with the poetic talent, bestowed upon me by you. The entirety

of meaning or the style of writing in this very treatise or work is all indeed yours. There isn't an iota of mine any.

**101.** కం ॥భావము నీదే, భాషయు
జీవము నీదే, గమకము చేవయు నీదే !
ఏవున్న నిందు చెణుకులు
హావము నీవే గదమ్మ ! హంసానందీ !

(భావార్థం:-ఓ హంసానందీ ! ఈ కావ్యమునందు వాడిన భాషయు,భావమును, జీవమును,గమకమును,చెణుకులును,చేవయు, హావమును అన్నియు నీవే (నీవు+ఏ,నీవి+ఏ) గదమ్మా ! )

(Meanig :-OH! HAMSA NANDEE, the one who enjoys the divine music, the one who showers the eternal bliss upon the sages who reach the ultimate state HAMSAA in YOGA observing quite rigorous paths! The language, meaning with profundity life, GAMAKAM (exertion, connection and pleasantness), CHENUKULU (incitement and excitement), CHEVA (skill, strength and core) and HAAVA (projections, dalliance, blandishment or an amorous gesture) used in compiling this KAAVYA (composition), all are indeed the very you! (and they are yours).

**102.** కం ॥ఖండవల్లి గృహాఖ్యులు ఖ్యాతిగల్గు
శిష్ట నరసింహ శాస్త్రుల శిష్యుడనయి,
పూజ్యగణపతి శ్రీదేవి పూజ చేయు
మాత మధురస్తవము పల్కె మధుర ఫణితి !

(భావార్థం:-ఓ భాషామాతా ! మా గురువర్యులు బ్ర॥శ్రీ॥వే॥ ఖండవల్లి నరసింహశాస్త్రిగారు. వారియొద్ద సంస్కృత వ్యాకరణసాహిత్యాది శాస్త్రము లభ్యసించితిని.ఆ సమయములోనే శ్రీమహాగణపతి,శ్రీదేవీసప్తశతి మంత్రపూజానుష్ఠానాదికములభ్యసించితిని.సంతసించిననీవు

మధురఫణితిని ఈ మధురస్తవమును పల్కించితివి. )

**(Meanig :-OH! Mother of all languages! Our master and spiritual mentor was BRAHMASHREE KHANDAVALLY NARASIMHA SASTRI GARU, the realized embodiment of VEDAS. I learnt from very him, the grammar of Sanskrit and literary sciences etc.. During the very course of time I also learnt the methodology of spell-fully worshipping with the order of religious ceremonies, by ceremonial observance , SHREE GAAYATHREE and SREE DEVI SAPTA SATHI.... You, having been pleased with that, let the sweet literature or literary flow be flowed or realized or uttered in this MADHURA STHAVAM, the sweet eulogy of you.**

**103.** కం ॥మాధవపెద్దిగృహోఖ్యుడ,
బోధాధీతాచరణుడ–బోద్ధలు మెచ్చున్,
వేధిత యోగాభ్యాసుడ,
సాధిత సాహిత్య శాస్త్ర చయుడను మిగులన్ !

**104.** కం ॥చినవేంకన్నను పేరును
నునిచిరి తాతలకు సంజ్ఞ–నోరిమిగలుగన్
ఘనతర శాస్త్రాలు చదువ
ననువుగ గురువులు పొగడగ నంచితరీతిన్ !

(భావార్థం:–మాధవపెద్ది చినవేంకన్న శాస్త్రియను పేర మా తలిదండ్రులు మాకు పూర్వీకుల జ్ఞాపకార్థము పెట్టి పిలవసాగిరి. చిన్నతనమునుండి పెద్దల అడుగుజాడలలో నడిచి ఆచరణాదులు,వ్యవహారాదులు, విద్యాభ్యాసాదులు సాగించి,సాహిత్యశాస్త్రాదులు అలవర్చుకొని,వేదాంత యోగసాధనాది మంత్ర శాస్త్రప్రవేశములు గుర్వనుగ్రహమున పొందితిని.)

**(Meanig :-My parents, having christened me**

**MAADHAVA PEDDHI CHINA VENKANNA SAASTRY in commemoration of our ancestors, (they) used to call me by that very name. Having walked in the very footsteps of all the elders ever since my childhood, (having) continued the observance of precepts of religion and etc., customs, learning of its practice and etc., I gained the knowledge of the theosophical portion of VEDAS in other words UPANISHADS and etc., the knowledge of the practice of abstract contemplation, contrivances and etc., the very entrances of the philosophy or the science of sacred spells or seed-syllables, with affectionate favor and blessings of my very GURU, my spiritual mentor.**

**105.** కం ॥గణపతి చాముండీశు ల

గణితసుగుణదాతలిచ్చి కావితాశక్తిన్

ఫణిపతి శాస్త్రము మెచ్చెడు

ఫణితిని మధురస్తవమును వ్రాయించి రహో !

(భావార్థం:-శ్రీమహాగణపతి శ్రీ చాముండీశీ దేవులు-అగణితసుగుణదాతలు-మధరకవితాశక్తినిచ్చి-ఈ మధురస్తవమును వ్రాయించిరి.వ్యాకరణ మహాభాష్యప్రవక్త ఆదిశేషులు మా గృహదేవత-ఇలవేల్పు! వారు మెచ్చునట్లు చాముండేశ్వరి పలికించినది.పద్యము పూర్తి అయిన-వెంటనే-వినిపించినంతనే-విప్పినపడగతో విని పడగ పంకించెడివారు తమ అంగీకారము తెలిపెడివారు. )

**(Meanig :-SHREE MAHAA GANAPATHY, SHREE CHAMUNDEE deities, are innumerable or inestimable generous or virtuous donors, who having bestowed me with agreeable poetic energy or power, have got this sweet or literarily delicious eulogy written or compiled. The great expounder and prophet of gram-**

matical texts, the great emperor of all the divine serpents, the God Lord, is our household deity or God! CHAMUNDESWARI DEVI has got this sweet composition pronounced as per their approbation or com-mendation. As soon as the poem has been finished or sooner read for them, with spread-hood, having hark-ened to it, they have made known us their consent or commendation moving their very crust thus.)

**106.** కం ॥నీ సందర్శన భాగ్యము

మా సంకల్పమును పెంచ, మాలతిలతగా

తా సాగె సుఫలయుతకృతి,

మా సౌభాగ్యము తెలుపగ మాతా ! తరమా !

(**భావార్థం:**-మా పూర్వజన్మ సుకృతము కతమున మాతా! నీ సందర్శన భాగ్యముకల్గినది.మా మదిలో కావ్యరచనా సంకల్పి మొదవినది-నీ కరుణా కటాక్షవీక్షణ బలమున సంకల్పిత మాలతీ లతగా సాగి చిగురించి,పుష్పించి ఫలించి కావ్యరూపము దాల్చినది.ఈ మా భాగ్యము వివరింప మాతరమా మాతా ! )

(**Meanig :-**As a result of our former birth, Oh! Divine Mother! we have been fortunate enough to have the sacred brilliance of the indeed you. The determination of compiling this very composition has got originated in the very mind. By the strength of your grace or mercy with favored eye-glance, having continued sprouting as the resolutely flowering as jasmine, the very determination has got bloomed resulting into this form of ceremonious composition. Is it possible for us to explain this our-luck or fortune? )

**107.** కం ॥దేవీ పితృగురుకృపయే

జీవిని ఘనకార్య మొగిని చేయించు భువిన్ !
నీ వీ కావ్యము కర్తయు
గావే ! కర్మయు క్రియయును కాంచన దుర్గా!

(భావార్థం:-వ్యక్తిజీవితములో ఏదైనా ఘనకార్యము జరిగినచో దానికి కారణము-దేవీ పితృగురుకృపయే అని అనుభవజ్ఞులు ఉవాచ.ఓ కనకదుర్గా మాతా ! ఈ చాముండేశ్వరీ మధురస్తవ కావ్యానికి కర్త కర్మ క్రియ సంపూర్ణముగా నీవే సుమా ! )

(Meanig :-If any great deed takes place in the individual life of any person, it is pronounced by the experienced says that it's the grace of either deity, or parent and mentor. Oh! The Divine MOTHER KANAKADURGA! You only are indeed fullfledgedly the doer, the doing, the cause of procedure or destiny or fate of this fine composition compiled on CHAAMUNDESWARI.)

108. కం ॥గీర్వాణ శ్లోకసరము
శర్వాణి ! కూర్చి గళమున చక్కగ వేయన్
పర్వపు పూజలు జరిగెను
సర్వానందకర మధుర సంభ్రమ మొదవన్ !

(భావార్థం:-ఓ శర్వాణీ ! నీ కరుణా కటాక్ష వీక్షణ ప్రభావమున పంద్రెండు సంస్కృత శ్లోకములను వివిధ ఛందస్సులలో రచించి వివిధదేవతా సుమములను కూర్చిన పుష్పదామమువలే నీ కంఠసీమ నలంకరించితివి.ప్రతి పూజావేళ భక్తులు సమర్పించు సుమదామములు మంగళకరములై, మనోహరములై ,సర్వానందకరములై సంభ్రమ దాయకములగును గదా. )

(Meanig :-OH! SHARVAANI! By the impact of your grace or mercy with favorable eye-glance, I, having composed twelve SLOAKAAS (verses) in Sanskrit in differ-

ent sorts of prosody, have compiled the string of eulogies of divine flowers upon different deities, adorned or embellished the very border of your neck. During the course of worshipping time, the flower-garlands those are consecrated by the devotee-folk, indeed become auspicious, heart-stealing, pleasing, lovely and fascinating to be exited and elated.)

**109.** కం ॥సూర్యనారాయణ సఖుడు చూప దారి
నేగుదెంచితి మమ్మరో ఇంపుమీర !
చిత్రమైనట్టి సంకల్పసిద్ధి కలుగ
బ్రోవ రావమ్మ రాజేశ్వరీ ! వరమిడి !

(భావార్థం:–ఓ రాజరాజేశ్వరీ ! నీ కరుణాస్వభావమపరిమితము కదా! ఎప్పుడెవరిపై నెలాప్రసరించునో ఎరుగలేము. ఒక భక్తుని ద్వారా ఇంకొక భక్తునికి నీ దయాగుణము ప్రసరించును.శ్రీ అయ్యగారి సూర్యనారాయణ మూర్తిగారి ద్వారా నీ దర్శనభాగ్యము మాకు కలిగినది. ఆ అవకాశము ఎంత ప్రయోజనకారియో అనుభవపూర్వకముగా తెలియుచున్నది. మనస్సు ప్రశాంతమై పవిత్ర సంకల్పములకు ఆలవాలమై మెలగుచున్నది. ఎంత ఆశ్చర్యకరమో చెప్పజాలము.)

(Meanig :-OH! RAJA RAJESWARI! The empress of the emperors! Your graceful nature or attitude is indeed limitless. We can't know when and whom, your mercy does flow upon. Current or stream of your very kindness spreads from one devotee to the other incessantly. We have had the fortune of your auspicious sight (DHARSHAN), by your devotee-duo, the pious couple SHREE AYYAGAARI SURYANARAYAN MURTHY GARU AND SHREMATHI RAJA RAJESWARI GARU. And how useful the opportunity is, perceived by us it by our sheer experience. The heart, having become

**peaceful with tranquility has become the abode of pious resolutions and is behaving accordingly. We can't say how amazing it is?)**

**110.** కం ॥గీర్వాణులనుచు బొగడగ
సర్వాత్మక ! గీరసజ్ఞ !శర్వాణి సుతా !
సర్వాత్మ నీదు భక్తుని
సర్వాత్ములు గీరసజ్ఞ సభ్యు లనిరి నన్

**111.** ఆ.వె ॥గీరసజ్ఞ యనిరి గీర్వాణులట నిన్ను
సర్వవేది వౌట శర్వ పుత్ర !
నీదు భక్తుడౌట నాదు కవిసఖులు
గీరసజ్ఞ యనిరి చేరి నన్ను !

(భావార్థం:-ఓ శర్వాణిసుతా ! సర్వాత్మక ! గీర్వాణులందరూ నీ వైదుష్యమునకు ముగ్ధులై నిను "గీరసజ్ఞ" అని కీర్తించిరి.నీ భక్తుడనైన నన్ను సభ్యులు ఒకానొక సభాసందర్భమున "గీరసజ్ఞ" అని పొగిడిరి. అప్పటినుండి( 'ఉపాహ్వ'గా లేఖినీ నామము "గీరసజ్ఞ" అనుపేరు చెలామణిలోకి వచ్చినది.)

**(Meanig :-Oh! SHARVAANI SUTHA! (SHREE GANESHA, the tutelage of all the fine-arts!) The all-pervading things! (The omnipotent!) All the deities, having been fascinated with your limitless-wisdom and prudence, have eulogized you as GEERASAGNA (GANESHA, the God of speech and learning who knows the relish of every verse). And on a certain occasion of convocation, the member-folk of it applauded me (also), this 'your-devotee', with 'GEERASAGNA'. Since then GEERASAGNA has become my literary pseudonym and come the same into the usage (current).)**

**112.**ఉ ॥ ఏమని పల్కనే బహుళ ! ఇందరు పండితులుండ నీ సభన్

శ్యామల! నీవు నా వదనసారససీమల నాట్యమాడుమా!

కోమలహంసపై విధిని గూడిన భారతి! వీణమీటుమా!

నోమిననోములన్నొసగు నోరమ ! భావన లూరజేయుమా !

(భావార్థం:-ఓ బగళా !(బహుళా !) ఇందరు పండితులున్న ఈ సభలో నేను ఏమని ప్రసంగించను ?కళాశ్యామలవై నా వదనతామరసవేదికపై బహు భంగుల నాట్యమాడుమా.నీ కళా విన్యాసముతో నా ప్రసంగము శ్రోతలనానంద సాగరడోలికల నూగించును గాక ! కోమలహంస వాహనముపై చతుర్ముఖబ్రహ్మతో కూడి ఆసీనవైయున్న ఓ భారతీ ! నా హృదయవేదికపై వీణ మీటుమా !నోచిన నోములన్నీ సఫలముచేయు ఓ రమాదేవీ! నా మనోహ్రదమున విశేషభావనలను ఊరింపజేయుమా ! నీ సహకారయోగమున నా ప్రసంగము సఫలమగునుగాక ! )

(Meanig :-OH! BAGALA! The abode of multiplicities, how could I deliver my speech in the assembly of these many a prudent? As an actress of a dark tint, on the platform of the emotions of true dark passions over my face in terms of relishing of lotus, verily dance with grace in abundant modes! With your artistic placing, may my deliverance of speech indeed swing the audience on the ocean of happiness! Oh! BHARATHI, having seated on the very soft and delicate vehicle, the swan, in union with 'the four-faced BRAHMA' (the Supreme soul), kindly play the harp on the Dias of my very heart! Oh! RAMAA DEVI, who fulfill all the undertaken vows of me with abundant grace, let my distinguishing imports be oozed out in the very lake of my heart. May speech of mine be successful with your reciprocate or sustaining-divine-providence.)

113.సీ ॥ ఏ నీ పయోధర స్వేచ్ఛామృతము గ్రోలి

సంగీత సాహిత్య శాస్త్రినైతి !

ఏ నీ కరద్వయి-నే నూతగా గొంచు

నడుగులు వేసితి నడక నేర్చి,

ఏ నీ మరాళము నేర్పింప పద్యాలు

సభలలో చదివితిన్ సరససరళి,

ఏ నీ విపంచిక ఇంపైన కచ్ఛపి

రాగాలు పాడించె రమ్యరీతి,

తే.గీ ॥ నీవు నిలుచున్న పీఠమ్ము తీవి నేర్ప,

నీదు చేతిలో జపమాల నిష్ఠ గూర్ప,

వ్రాయుచున్నాను చాముండి సాయమంది,

ఓ రసద్ధృతీ ! భారతీ ! గీరసజ్ఞ !

(భావార్థం:-ఓ రసద్ధృతీ ! భారతీ ! పదగతరసమును సంపూర్ణముగా నెరింగిన సరస్వతీదేవీ ! ఓ గీరసజ్ఞా ! ఏ నీ పయోధర స్వేచ్ఛామృతము నుండి స్వేచ్ఛగా స్రవించు దుగ్ధామృతమును తనివిదీరా గ్రోలి నీ యనుగ్రహముతో సంగీతసాహిత్యశాస్త్రాలలో శాస్త్రినైతిని.నీ చేదోయి నానరాగా చేకొని నేను నడకలు నేర్చి నడవగలుగుచున్నాను. నీ వాహనమైన మరాళము(హంస) పద్యాలు చదువుట నేర్పింపగా సభలలో సరస సరళిలో చదువగలుగుచున్నాను.నీ చేతులలోని విపంచిక-కచ్ఛపి-సమ్మోహన పూర్వకముగా రాగాలు నేర్పించి రమ్యరీతిలో పాండించుచున్నది.అమ్మవారివై నీవు నిలుచున్న పీఠము నాలో తీవి నింపుచుండగా,నీ జపమాల నిష్ఠనేర్పగా ఈ మధురస్తవమును నీ సాయమంది వ్రాయుచున్నాను.)

(**Meanig :-OH! RASADHRITHI! The embodiment of the essence of relish or flavor! BHAARATHI! The deity that shines the merriment. Oh! SARASWATHI DEVI (The consort of BRAHMA) the Goddess of word and**

**speech who knows the origin, meaning and the gait of the entire glossary, Oh! GEERASAGNA, the Goddess of speech who completely knows the parse or the flavor of the gait of all the words regarding (in other words that makes effulgence with the comprehension of the originality of the word. Having had ambrosia like milk which that oozes freely from the very breast of yours in content and satiety, with your favor, I have become SAASTRY in the sciences of music and literature. I am able to trot now, having taken the support and sustenance of your duo of divine hands. When your pious vehicle, the Swan, has kindly taught me how to recite poems, I am able to read or recite the poems in quite an order, in many literary and devotional congregations. The holy harp of you, named KACHCHAPI (made of tortoise shell), having divinely taught me 'the RAAGAAS in fascinating style, is aptly viewing them be sung in a beautiful and a melodious manner through me. While your seat on which you stand, being AMMAVAARU, is filling the majesty into me, your rosary string of beads has taught me attentive austerity, I am ably writing this sweet eulogy having had your very help.)**

**114.సీ ॥ ఏనీదు లకుమివీణెను మీటు కరములు**
**మాటలు నేర్పించె మధువులొలుక,**
**ఏనీదు నందంపు టీకదంతము మాకు**
**కైతలు వ్రాయంగ చేత చేసె,**
**ఏనీదు వక్రంబు టిభ తుండ వక్త్రంబు**
**శాస్త్రార్థ చర్చలన్ చక్క నేర్పె,**
**ఏనీదు విఘ్నాల కిరివైన యుదరంబు**

విజయాలు చేకూర్చు వేగవనుల,

తే.గీ ॥ చిట్టెలుక పైన పయనించి చింతదీర్చి,

శంభుపంచాక్షరీమంత్ర శక్తి నొసగి,

అమ్మ అన్నపూర్ణ కరుణ నందజేసి,

పేరు ప్రతిష్ఠ లిత్తువో గీరసజ్జ !

(**భావార్థం:**–ఓ అన్నపూర్ణా విశ్వనాథదంపతీ పుత్రా ! గీరసజ్జ ! నీ చేతులలోని ఏ నీదు లకుమివీణను మీటు కరాంగుళులు మాకు మాటలు మధువులొలుకునట్లు మాటలాడ నేర్పించెను.అందమైన నీ ఏకదంతము మధరమైన కవితలు వ్రాయింపజేసెను. ఎడమవైపు వంకరతిరిగియున్న తొండముగలిగిన నీ ఏనుగుముఖము మాకు సకలశాస్త్రవిద్యలను నేర్పించి చర్చలలో పాల్గొని వాదించు వైదుష్యమును నేర్పించెను. అన్ని విఘ్నములను తనలో దాచుకొను నీ లంబోదరము మా చిఘ్నములను తొలగించి సర్వకార్యములందు వేగమే విజయాలు సమకూర్చెను. ఓ విఘ్నేశ్వరా ! నీవు చిట్టెలుకపై పయనించుచూ మా చింతలన్నీ తీర్చుచూ, నీ శివభక్తి ప్రభావముతో మాకు పంచాక్షరీ మంత్రముపదేశించి శివశక్తిని ప్రసాదించి,అన్నపూర్ణామాతృకరుణను కలుగజేసి,పేరు ప్రఖ్యాతులు ప్రసాదించుచున్నావు ఓ గీరసజ్జ దేవ! )

(**Meanig :-**Oh! The son of the divine-couple SHRI SHRI SHRI KAASI VISWANAATH and the deity SHRI ANNAPOORNA DEVI, the one who knows completely the word included and of its gait! The divine fingers of yours those play the very holy lute, called LAKUMI, have taught us how to talk in quite a relished manner. Your graceful single piece of tusk (of ivory), have made me to have compiled the syrupy odes. Your divine elephant face that possesses the divine trunk curved towards your left side, having taught us, all the schools of

religions and literary sciences, has taught us the required prudence not only to participate in the discussions and also to go on arguing successfully. The great belly of yours (Lambodharam) that conceals all the obstacles or hindrances in it, having removed them, has furnished success the sooner, in all our very tasks. Oh! VIGNESHA! The lord of all obstacles! You are while travelling by pretty rat and removing our obstacles, having taught us the incantation PANCHAAKSHARI (OM NAMAH SIVAAYAH) with the very impact of your devotion over Lord SHIVA, and having bestowed us the power of Lord SHIVA, having begotten us the grace of the deity SHRII ANNAPOORNA DEVI, granting us celebrity renounce and reverence (name and fame) OH! God! The GEERASAGNA!)

115. మ ॥కవితాధారలు జాలువారును హిమాగాగ్రాల సంపాతముల్
భువిపై దూకెడు రీతి నో భగల ! నీ పూర్ణానుకూలాక్షముల్
కవిపై వ్రాలిన బారవే మరి మహాకావ్యాంశ సాహిత్యముల్
కవికిన్ నీకును భేద మేమియును లోకానన్ కనన్ రాదుగా !

(భావార్థం:–ఓ బగలా ! నీ పూర్ణకరుణాకటాక్షములు ఏ వ్యక్తిపై ప్రసరించునో ఆ వ్యక్తి కవియై నీపై మధుర కవితలు వ్రాయగల్గును. హిమాలయములనుండి క్రిందకు దూకు జలపాతములవలె ప్రవహించు స్వభావముగల మహాకావ్యాంశ సాహిత్యము గల్గిన కవితాధారలు జాలువారుచు మహానదులవలె సాగును. అనగా కవికి నీకు ఏ మాత్రము భేదము లేదని తెలియుచున్నది.)

(Meanig :-OH! BAGALA! The embodiment of all the multiplicities! Whoever the person, on whom your complete merciful and favorite eye-glances are extended to that person, having become a poet, can write every syr-

upy ode on you? Therefore, it's clearly perceived that there isn't any difference between a poet and you.)

116.సీ ॥ గురుదేవు నాశీస్సు లిరులన్ని తొలగింప
జ్ఞానకాంతులు జిమ్ము మానసాన,
గురుదేవు బోధలే కరకు శాస్త్రాలలో
క్లిష్టమౌ మర్మాల కిటుకు దెలుపు,
గురుదేవు నడవడి కరదీపికై వెల్గి
జీవన గమ్యంపు త్రోవజూపు,
గురుదేవు గృహసీమ తిరునాళ్ళ తలపించు
దివ్యపూజలు జర్గు దేవళంబు

తే.గీ ॥ బ్రహ్మ విష్ణువు రుద్రుడు త్రయము గూడ
అత్రి అనసూయలకు దత్తుడైన స్వామి
నాల్గువేదాలు ధర్మంబు నడిచి రాగ
మందహాసము చిందించి మనల బ్రోచు !

(భావార్థం:-ఓ వరాళీ ! కవియును నీవును ఏకమే కనుక మీ యిద్దరి రచనా ప్రక్రియలు రెండును దాదాపుగా ఒకే విధముగా నుండును. నీవే విధముగా జగత్-సృష్టిస్థితిలయలను నిర్వహింతువో కవికూడా అదేవిధముగా కావ్య జగత్-సృష్టిస్థితిలయములను నిర్వహించును.ఇద్దరూ పాత్రలను పుట్టించి,గిట్టించి నానావిధ సన్నివేశములను,సంఘటనలను, సంభాషణములను,దృశ్యములను ఏర్పరచి జగన్నాటక నిర్మాతల గుదురు.)

(Meanig :-OH! VARALI! The bestower of infinite boons! As you and the poet are the same, both the manner of compositions also almost are the same, how do you carry through your creation, sustention and destruction of the universe in the same way or as it is, the poet also man-

ages creation, existence and destruction of the literary world. Both of you, having created, sustained and destructed innumerous roles, having set forth many grounds, events or occurrences, conversations and scenic-visible for them, become the producers of the universal drama. )

117. మ ॥అనసూయాత్రులు దివ్యతేజమును సత్త్వాధిక్య రూపంబుతో
తనయుండై తమ గర్భ వాసమున భద్రంబై జనింపుండనన్
మనసా దల్చుచు భౌతికంబు విడి సమ్మాన్యంపు సంతానమై
ఘనమౌ రూపున దత్తుడయ్యె తను సంఘాతాకృన్ నేకమై !

(భావార్థం:-కాకపోతే-విశేషమేమనగా-ప్రకృతిలోని మాధుర్యము కావ్యములోనికి ప్రసరించుటయందున్న ప్రతిభ నీదే సుమా ! నీ అనుగ్రహముచే బీజరూపమున "ప్రతిభ" కవిలో ప్రవేశించనిచో,కవిలోని ఆ ప్రతిభ పెరిగి పెద్దదై కావ్యమాధర్యమును ఎంతమాత్రము ఒలికించ లేదు.మధురకవితను ప్రదర్శించలేదు. )

(Meanig :-However, the singularity or specialty is - how the sweetness from the nature extends into the poetry, 'that very talent' indeed is of yours only. If your talent doesn't spread into the poet in the essential form of a letter, spell or a charm, that personal talent in the poet, having go grown huge in size, can't utter the syrupy of composition and can't even compose or display a sweet poem or relished ode. )

118. మ ॥కవియున్ నీవును ఏకమే గనుక, మీకార్యాదులేకంబులౌ
భువిలో పాత్ర లనేకముల్ వరుసగా పుట్టించి గిట్టింపుచున్
అవనీనాటక కావ్యముల్ మధుర పాత్రాలాకృతంబై రచిం
త్రు, వరాళీ! మరి-నీదె యా ప్రతిభ-మాధుర్యంబు చిందించుటన్ !

(భావార్థం:–ఓ గురుదత్త స్వరూపిణీ !అనఘా సుస్వరూపిణీ ! బ్రహ్మ విష్ణురుద్రు లేకమై అత్రి అనసూయా దంపతులకు పుత్రుడై దత్తమైనాడు. ఆయనలోని శక్తి అనఘాదేవివి నీవే ! కాగా దత్తుడు అనఘస్వామి యయ్యెను. గురుపీఠాధిపతి యయ్యెను. నాల్గువేదాలు శునకములుగా, ధర్మము గోవుగా అనఘుని అనుసరింపగా, గురుదేవుడై భక్తుల పరిరక్షించుచున్నాడు.గురుదేవు నాశీస్సులు కాంతికిరణములై అజ్ఞాన తిమిరాన్ని తొలగించి జ్ఞానదీప్తులను మనస్సున విరజిమ్మును. గురుదేవుని బోధలు క్లిష్టమైన శాస్త్రవిషయాలను వివరించి బోధించి కఠినమైన శాస్త్రాలను సులభముగా తెలియజేయును. గురుదేవుని ప్రవర్తన కరదీపికయై జీవనగమ్యస్థానానికి చేరుత్రోవను స్పష్టముగా చూపించును. గురుదేవుని మందిరము నిత్యపూజోత్సవములు జరుగుచూ భక్తులను తనిపించు తిరునాళ్ళ తీర్థస్థానము. అట్టి గురుదేవుని అనుగ్రహమునకై, చిరునవ్వుతో మనల నాశీర్వదించుటకై ప్రార్థింతును.)

(Meanig :-OH! The pious form of SRI GURUDATTA! The form of deity ANAGHA! The Triad, BRAHMA, VISHNU and RUDRA, having conjoined together into a single form, have got or gone adopted as a son to 'the pious couple' sages ATHRI and his better-half ANASUYA. You are indeed the ultimate power in him i.e. ANAGHAA DEVI. Therefore, the DATTA has become ANAGHAA SWAAMY and also has become the preceptor or the master of the sacred seat. While the four Vedas as dogs, and DHARMA (virtue) as a cow following ANAGHA, He, having become the mentor God, is examining the metal of devotees of devotion. The blessings of GURUDEVA having become the rays of radiance, having removed the darkness of ignorance, toss the effulgence of wisdom into the very heart. The teach-

**ings of GURUDEVA, having explained intricacies of the subjects or objects of sciences and having taught them, reveal the complicated or severe sciences quite easily or attainably. The conduct or behavior of Mentor God having become the hand-lamp shows the path clearly how to reach the attainability of the means of subsistence of life. The temple of GURUDEVA, wherein incessant festivity of worshipping goes on shining, is a temple festival, the sanctified place, drenching the devotees in devotion. For that sort of favor of GURUDEVA with a smile, I pray to Him to bless us.)**

**119.సీ ॥ చాముండి దేవివై భూమీశి వైనావు**
**రెండు తొమ్ముదులొచు నుండ భుజలు,**
**సకలదేవీదేవుల కమనీయపు రూపు**
**నీమూర్తిలో గూడి నిండియుండ,**
**సకలాస్త్రశస్త్రాలులు సంపూర్ణశక్తితో**
**పదునెనిమిదిభుజ పంక్తి నిండ,**
**శత్రులం గూల్చుచున్ శాంతి సంస్థాపించి**
**భక్తుల బ్రదుకులు పదిలపరిచి,**
**తే.గీ ॥ పసుపు కుంకుమ పూజలు పడతులొసగ**
**భర్తృదేవుని తోడుగ భక్తి గొనుచు**
**బ్రోవు చున్నావు చాముండి పుణ్యమొసగి**
**చెప్ప తరమౌన నీ గొప్ప ఒప్పు కుప్ప !**

**(భావార్థం:–ఓ అమ్మా ! ప్రకృతిలోని నానావృక్షాలతాదులు పుష్పించు నానావిధ సువర్ణసుగంధ కుసుమాలను సేకరించి నీ ఎత్తు పెద్ద పూమాలను కూర్చి నీ గళమున అలంకరింవ కుతూహాలము కలుగుచున్నదో దేవి! ఎందుకనగా నీవు సకల సుమసుకుమార**

సుదేహావు. నానా దేవీదేవదత్త సంఘాత సుందరసుదేహావు. ఈ భూలోకమందున్న నానాజాతిజనాళి భక్తపూజిత సుచరణద్వంద్వవు. మమ్ముద్ధరింప జోగ్పేట ప్రాంతములో వెలసిన చాముండేశ్వరివి. )

**(Meanig :-Oh! The Divine Mother! Having collected many varieties of different golden-fragrant-flowers those blossom to many sorts of trees and creepers, having accumulated them into a garland to the height of your sacred idol, I am indeed getting eagerness to embellish your very neck with it Oh! Deity! Because you are the one who has a comely body of all the varieties of soft flowers, thus you are the beautiful corporeal or proven embodied Soul. You are the one who has beautiful form of an assemblage of innumerous deities and gods presented in. you only possess the pair of pious feet, those are worshipped by many a multitude of different devotees in nature on this very earth planet. In order to sustain and restore us, you have kindly appeared yourself indeed as CHAAMUNDESWARI DEVI in the region of JOGIPET.)**

**120.** శా ॥నానావర్ణ సుమాలు గూర్చి, పొడవౌ నవ్యంపు పూమాల–నో

సూ నాకారసుదేహ ! గళమునన్ సొంపార నర్పింపనా

నానాదివ్య సుదేహ వౌచు భువిపై నైర్మల్య సంధాత్రివై

నానాజాతి జనాళి బ్రోవవెలయన్ నాతల్లి జోగ్పేటలోన్ !

(భావార్థం:–ఓ ఒప్పులకుప్పా ! చాముండిదేవివై,సకలదేవదేవుల శక్తి సామర్థ్యాదులతో వెలసి భూమీశివైనావు. పదునెనిమిది భుజపంక్తియందు శస్త్రాస్త్రములను దాల్చి సర్వశత్రుసంహారిణివై,శాంతిధర్మ సంస్థాపన మొనరించి, భక్తులను పోషించుచు, మధురమూర్తివై పూజలందు కొనుచున్నావు. దంపతులొసగు పసుపుకుంకుమ పూజలు విశేషముగా

భర్తృదేవుని తోడుగా స్వీకరించుచున్నావు.భక్త దంపతులను మనసార బ్రోచుచున్నావు.నీ కరుణా హృదయమును వర్ణింపగలమా ! )

**(Meanig :-The OPPULAKUPPA, the heap of fitness, agreeability and sheer aptness, being the deity, CHAAMUNDEE DEVI, having acquired the power and talents or adequacies of all other deities and gods, having appeared yourself, you have become the empress of the very earth, having worn the divine weaponry with your eighteen mighty arms, being the destructor of all the foes (evil-forces), having efficaciously established the DHARMA or virtue of peace while nurturing the devotees, being the embodiment of syrupy, are receiving the worshipping and you are receiving the devout-worshipping with the turmeric and vermillion, especially with your consort , and you are protecting thus, the devotee-couples, can we describe the graceful heart of you in any manner? )**

121.సీ ॥ పద్మ సుగంధిరో ! పద్మాలు ముకుళించె
నీదేహ గంధంబు నిశ్వసించి,
కైరవ నేత్రరో ! కలువలు వాడెను
కనుదోయి సొబగులు కనుపడంగ,
చంపక నాసరో ! సంపంగి వంగెను
నీ నాస సొగసులు నెమరువేసి
లవలీ సుగాత్రిరో ! లవగాలు ఘూటెక్కె
నొయ్యారమును జూసి ఓర్వలేక,
తే.గీ ॥ ధనువు విరిగెను కనుగొని కనుబొమలను,
త్రీలు మెలికలు తిరిగెను చెవులు జూచి,
చండి నినుగూర్చి ఉపమింప జగతియందు-

వస్తువేదియు లేదమ్మ వివరించి,
నీవ ఉపమాన ముపమేయ మీవ సుధను-
వ్యష్టిగా దోచు సృష్టి సమష్టి యయ్యు !

(**భావార్థం:-ఓ చాముండేశ్వరీ ! ఈ లౌకికజగత్తులో, ఈ సృష్టిలో-ఈ ప్రకృతిలో కవితారంగమునందు ఉపమాన ఉపమేయములు రెండు నీవే ! ఏ ఉపమాన వస్తువును తీసికొన్నను నీ ముందు అసమర్థమగుచున్నది. నీ దేహగంధమును ఉపమించుటకు పద్మమును తీసికొనగా పద్మములన్నియూ ముకుళించుకొన్నవి.నీ కనుదోయిని ఉపమించుటకు కలువను ఎన్నుకొనగా కలువలన్నియు వాడిపోయినవి. నీ నాసికను ఉపమించుటకు సంపంగిని స్వీకరించగా సంపంగులన్నియూ వంగిపోయినవి.నీ శరీరకృతిని- వంపుసొంపులను-ఉపమించుటకు లవంగలతను ఆహ్వానింపగా లవంగాలన్నియు కారమెక్కువయి ఘాటెక్కినవి. కనుక సమష్టిగానున్న సృష్టి మనకు వ్యష్టిగా దోచును. అలానే నీ కనుబొమ్మలను చూచి ధనవు వంగినది. నీ చెవులను చూచి శ్రీకారములు మెలికలు దిరిగెను-ఏ వస్తువు నీకు సమానముగాదు. సౌందర్యమునందు- నీవే ఉపమేయము-ఉపమానమును నీవే- )**

**(Meanig :-OH! CHAMUNDESWARI! In this mundane universe, in this creation, in this very nature and in the realm of poetry, you are both the comparison (simile; the object which a thing is compared) and the compared (the object which is compared to another) whatever the subject taken in comparison to you, it becomes incompetent before you. When we have taken the fragrance of your pious body for comparison to the flower lotus (that blossoms in day light due to the Sun), all of them (lotus flowers) have shut themselves in. when we have selected your pair of comely eyes to be compared with the water**

**lily (a kind of lotus that blossoms in the night due to moonlight), all the water lilies have withered out at once. When we have accepted your nose to be compared with 'gold-flowers, all of them have bent down themselves. When we have welcomed the Mein of your divine form and its elegance with graceful curves to be resembled with a creeper of a clove, all the cloves have become pungent with pungency. That's why; therefore the unified creation of yours appears in the form of diversity for us. In the same manner, having seen your eyebrows, 'the bow itself has bent down'. Having witnessed your beautiful ears the letter SHREE has turned or entangled into many a twist. No subject is equal to you thus to be compared. Even in the matters of grace or elegance, you only are both the comparison and the compared also.)**

**122.** మ ॥శంకువు సిగ్గుతో జలధి జారెను, తుమ్మెద పద్మగర్భమున్
జంకున దూరె-నా గుబురు చాటున దాగెను మల్లె కుందుచున్,
వంకర బోయె శంక శశి, పారెను నాగము భీతి కానకున్,
శాంకరి! నీదు పోలికకు చాలని వన్నియు నిల్వజాలునే !

(**భావార్థం:**-నీ కంఠమునకు ఉపమానముగా శంఖమును చెప్పుదమనగా శంఖము సిగ్గుతో సంద్రమునమునిగి దాగుకొన్నది.కేశములకు తుమ్మెదలను చెప్పుదమనగా పద్మములనందు భయమున దూరెను. మల్లెలను ఉపమానముగా దంతములకు చెబుదమన్న బాధపడుచూ పొదలమాటున గుబురులో దాగుకొన్నది.ముఖమునకుపమానముగా చంద్రుని చెప్పెదమన్నచో వంకరబోయి మబ్బులమాటున దాగెను. వక్షస్థలమునకు ఉపమానముగా చెప్పెదనమకొనగానే ఏనుగు అడవిలోకి పారిపోయెను. ఓ శాంకరీ ! నీదు పోలికకు చాలనివన్నియు నిల్వగల్గునా ?)

(**Meanig :-**When we wish to tell a comparison to your

**very neck with the conch-shell, all the conches have hidden themselves into the sea being bashful or ashamed with shyness. When we take your beautiful hair in comparison to the wasps, all of them have penetrated into the flowers with fear. When we take jasmines to be compared with your teeth, they have, with grief stricken, hidden themselves in the foliage of bushes or shrubs. To the comparison of your graceful face, when we tell the moon, it having curved itself into a 'crescent', hidden behind the clouds. To the very breast of you, when a resemblance is taken with elephant's region of the head, the elephant has fled itself into the forest. Oh! SHANKARI, the consort of Lord SHANKARA, can they continue to exist or stand themselves, those subjects which are inadequate themselves to be compared in comparison to you? )**

**123.సీ ॥ కావ్యమా ! నీకింక కలవరం బదియేల ?**
**ఏక దంతుడు వెంట నీకు నుండ !**
**కావ్యమా !నీవింక కంగారు బడనేల?**
**శ్రీవాణి కళ్యాణ సేన లిడగ !**
**కావ్యమా ! నీకేల గాభరా మదిలోన ?**
**రసగంగ దలదాల్చు రసికు జుండ !**
**కావ్యమా ! నీకేమి గడ బిడ ? నరసింహ**
**శాస్త్రులే జౌచిత్య చర్చసేయ !**

**తే.గీ ॥ ఒకట దేవతలందరు నొదిగియున్న**
**చండి నీ గుండెలో నుండ శాస్త్ర హస్త !**
**కావ్య సంపద కొరతకై కలతవలదు-**
**దిగులు పడనేల రచనకై-దేవి చూచు !**

(భావార్థం:–ఓ చండీదేవీ ! నీవు గుండెలో నిత్యము నిల్చియుండగా – శస్త్రహస్తవై–శాస్త్రహస్తవై–వెన్నుదన్నుగా అభయమిచ్చుచుండగా కావ్యరచనకై కావ్య సంపద కొఱతపడునేమోయని కలతపడవలను వలదు. నీవు సకల దేవతా సంఘటిత స్వరూపమవు.కనుక కావ్యమును ప్రోత్సహించుచున్నాను:– ఓ కావ్యమా ! నీకు కలవరపడనవసరము లేదు–ఏకదంతుడు నీ వెంటవున్నాడు. కంగారు వలదు–శ్రీవాణి అక్షతలిచ్చి ఆశీర్వదించుచున్నది. గాభరాపడవలదు–రసగంగను దాల్చు రసికశేఖరుడు ఆశీస్సులిచ్చుచున్నాడు. గడబిడపడకు–గురువర్యులు శ్రీ నరసింహశాస్త్రులు ఔచిత్యచర్చచేసి అభయ మిచ్చుచున్నారు– కనుక రచనలో లోటుపాట్లు శ్రీదేవి స్వయముగా పర్యవేక్షించును.)

**(Meanig :-OH! CHAAMUNDEE DEVI! When you are in the core of our very heart, in perpetuity, being the wearer of the divine weaponry in one hand and all the sciences in the other (hand), by standing right behind us, bestowing us with the assurance of security or promise of protection, we shouldn't be under any perplexity of an iota of dearth of 'poetical wealth required' for composing poetry. You are the divine embodiment of occurrence with the multitudinous deities and gods. Therefore I am encouraging the poetry; oh! KAAVYAMA (the form of poetry), you need not agitate yourself - EKADHANTA, the God with single tusk is right behind you. Don't be hurried, SHREEVAANI, the goddess of speech, having granted sacred-rice is indeed blessing you. Don't get yourself feared unnecessarily -RASIKA SEKHARA, Lord SHIVA, the Lord of all arts who bears RASAGANGA, the river of relishing, is bestowing you with his blessings. Don't get confused yourself - your Spiritual Mentor God SHRI NARASIMHA**

**SASHTHRULU having made genuinely valid discussions, is awarding you his pious impunity. So, whatever the dearth or deficiency or demerits if any, in the composition be taken care of or well executed by SHREE DEVI, the Goddess of all the fortunes and the (literary) riches. )**

**124. ఉ ॥రీతులు వృత్తులున్ రసము శ్రీముఖి ! పాక మలంకృతుల్ గుణో**
**పేతములై భవత్కథన పేశల వర్ణన పూతధార–లా**
**పాత మనో హరాంచిత సుభాషిత భూషిత కావ్యసంపదల్**
**శీతనగాగ్రపాత రససింధు సమాగత ప్రాణభూతముల్ !**

**(భావార్థం:–కావ్య రచనకవసరమగు కావ్యాంగములు–రీతులు,వృత్తులు, పాకములు,అలంకారములు,గుణములు,ధ్వనులు,విషయాంతరవృత్తులు మొదలైనవన్నియు నీ వర్ణన సంభరితములై,సురధునీ రస సంపూర్ణములై శీతనగాగ్ర సంపాత జలపాతములై,రసగంగా ప్రవాహములై,ప్రాణికోటికి జీవప్రదములై,సుభాషిత కావ్యకల్పతరువులై వెల్గుచున్నవి. )**

**(Meanig :-The needful branches of compositions for any poetic composition, the modes or styles of rhetoric, the causes of the poetic activities, expositions or commentaries, of authors, the science of rhetoric or figures of speech, properties of poetry, characters, characteristics, the elliptical meanings of author in subtlety and disparities of poetic activities etc., immensely filled with your description being heavenly streamful- perfections, being originated of descending or falling waterfalls of your description as a whole or entirety, the currents of the river of relishing is shining all over, being the life or vitality of all the creatures, being the spoken language or speech, that's the wish-yielding tree of speech.)**

**125. చ ॥నవరసశోభి కావ్యమున నవ్యత నిండిన తావియబ్బుటే–**

అవుగద బంగరమ్మునకు! నాశ్రితభక్తులబ్రోచు తల్లి !ఆ
భవు సగమైన పూర్ణిమకు భవ్యపు శోభలు కీర్తి పెంచవే !
శివ గుణరాశి సర్వము నశేషము నిండగ దేవిగుండెలో !

(భావార్థం:-ఓ భవానీ ! నీ పతిదేవునిలో సగమై,భవుని గుణగణముల నన్నిటిని పంచుకొని, నీ గుణగణములను పెంచుకొనగా నీ కీర్తిప్రతిష్ఠలు పెరిగి ఎంతో ప్రాచుర్యమును పొందునుగదా !అలానే నవరస శోభితకావ్యము కాలానుగుణముగా నవ్యతనిండినచో బంగారమునకు తావియబ్బినట్లు కావ్యత్మకు శోభ పెరుగును.ఆశ్రిత భక్తుల బ్రోచు తల్లి అన్నపూర్ణ !నీకివే మా జేజేలు ! )

**(Meanig :-OH! BHAVAANI! The consort of BHAVA (Lord SHIVA), having become the better-half of your spouse BHAVA, having shared all of his virtuous attributes, thus when you grow your dispositions, your very fame and reverence, having grown immensely indeed gets gained excessive celebrity. In the same manner, the poetic composition that shines with effulgence being adorned with the nine flavors or humors in accordance with the time, if freshness is filled in, as it is like 'gold gains fragrance also', then the refulgent-lustre grows up to the spirit or soul of the poetic composition (sound; the elliptical meaning). OH! ANNAPOORNA! The sustainer and fosterer of all the creatures at full length and who endows all with all the edible stuff irrespective of its stature and mettle, the protector of the refuge-sought devotees to very you are all the salutations and obeisance of them.)**

**126.** ఉ ॥ప్రొద్దున మొగ్గగా నిలిచి,పూయగవేచి, గులాబి,కొమ్మపై
నొద్దిక నూగుచున్ పవనమూప-నీయారము జూపుచున్

ముద్దుల రేకులన్ విడిచి, ముచ్చట గొల్పు సుగంధి పుష్పమై
పద్దెపురూపు దాల్చె నిశి! పాటలగంధి పదంబు చేరగన్ !

(**భావార్థం:-** ఓ పాటలగంధీ ! నీ కావ్యమూర్తి పరిణామము చాల చిత్రమైనది. గులాబిమొక్కకు వేసిన మొగ్గ ప్రొద్దున చూచినపుడు ముద్దుగా బొద్దుగా ముచ్చటగొల్పినది.గాలివీచినపుడు ఒయ్యారముగా నూగుచు క్రమక్రమముగా రేకులు విప్పుచు సాయంకాల మగుసరికి విరిసి పుష్పమైసుగంధము వెదజల్లుచు అచ్చముగా కావ్యములోని పద్దెపు రూపు దాల్చినది.దేవీ పాదద్వయపూజకు సిద్ధమైనది గులాబిపూవు, కావ్యపద్యము పరిణామక్రమమున సఫలమైనవిగదా ! )

(**Meanig :-**OH! PAATALA GANDHI! The possessor of the fragrant odors (of the flower paatala) ! The metamorphosis of your poetic form is indeed singular. In the morning when we have seen the bud that's generated to the branch of a rose plant excitedly has set us enamored of being charmingly corpulent. When the wind has tenderly blown, swinging gracefully the bud, by unfolding its petals one after another, having blossomed as a perfect flower by the evening, emitting fragrant odors, purely, have taken the form of poem of composition, and thus has got itself ready to the worship of the pair of pious feet of Devi. In the process of transformation, both the rose and the composed poem are indeed successful.)

127. శా ॥ఈ సంధ్యా సమయంబులోన ప్రకృతిన్ ఈశీడులోకేశుతో
శ్రీ సర్వేశ్వరి ఆహిమాలయమునన్ చిందింపలాస్యంబు నూ
హో సంగీత విశేష వాద్యలయలన్ హోవాన, జోగ్వేటలో
హో సోద్దీపముఖీ ! సమీపకృతియై ఆనందమొందిచునే !

128. శా ॥కైలాసాద్రినటుండు మంచెపయి శ్రీ కంఠుండు సాయంబునన్
లీలాతాండవ నాట్యమాడ-నటివై లీలానయ విన్యాసముల్

హేలాభావ పదావఘట్ట నములన్ హేత్వంచితంబైనటుల్
ఓలోకేశ్వరి ! శాస్త్రపాండితినిడన్-నూహింపసాధ్యంబొకో!

(**భావార్థం:-** ఓ హాసోద్దీప ముఖీ ! ప్రతిదినసాయంసంధ్యాసమయాన సర్వేశ్వరునితో పాటు తాండవ నృత్యానికి తగిన లాస్యమును నీవు నటించుచుండగా ఆ రజతాద్రి ఎంతగానో పరవశమొంది ఆ హిమాలయపర్వత శ్రేణినంతయు పులకింపజేయుచున్నది. ఊహాసంగీత విశేష వాద్య లయములతో, హావభావములతో నీవు ప్రదర్శించు ఆ నాట్యము మా కిక్కడ చిటుకుల మందిరమందు(జోగిపేటలో) మాముందు ప్రదర్శించినట్లు ఆనందము కలిగించుచున్నది. )

(**Meanig :-** OH! HASODDHEEPA MUKHI! The illuminating-faced with smiling! While you are staging your performance to the very tune of the divine dancing of Lord SHIVA (the dance form of the violent capering), at every auspicious hours of dusk, the silver mountain (RAJITADHRI/KAILAASAM), having seized in an eternal paroxysm overcoming ecstasy is 'blissfully bewildering' the entire row of the Himalaya Mountains. The dance that you perform with different soulful amorous gestures with dalliance or blandishment or expressive postures and poses, immensely accompanied by unique music instruments, to our very imagination appears, as if you were, we feel, performing in the very MANDHIR of CHITUKULA temple (JOGIPET), thus its begetting us the utmost bliss here itself.)

**129.** కం ॥కాళీ లక్ష్మీ వాణీ
లీలా రూపున త్రిమూర్తి లీలలు కలియున్-
హేలా రీతులు సృజనయు
పాలన తోడుగ లయమును పరవృదు వీవే !

130. కం ॥నీవొక మధురపు మూర్తివి !
లావణ్య సేవధి వగుచు లక్ష్మీ వాణీ
భావిత హైమవతివి ! దివి
దేవతలందురు వనువగ దిగివచ్చితివే !

(భావార్థం :-ఓ త్రిమూర్తి స్వరూపిణీ ! సృష్టిస్థితిలయములకు అధీనమలైన బ్రహ్మవిష్ణు మహేశ్వరులయొక్క=శక్తిస్వరూపముల యొక్క, వాణీలక్ష్మీకాళీ దేవతలయొక్క=ఐక్యస్వరూపిణివైన నీవు శేషివై ఆమూడు కార్యములను నెరవేర్చు దేవాధిదేవతవై వరలుచున్నావు.కనుక మధురమూర్తివై,లావణ్య సేవధివై,దివినుండి భువికి దిగివచ్చిన సౌందర్యవరాకాష్ఠవు సుమా ! )

(Meanig :-OH! THRIMURTHY SWAROOPINI! The embodiment of the triad form of deity! You, being the embodiment of the unified form of the deities SARASWATHI (the goddess of Speech and word), LAKSHMY (the goddess of riches and prosperity) and KAALI ( the consort of Lord Kala (Shiva)), the pious-potencies of the Hindu-triad of BRAHMA, VISHNU, MAHESWARA who are the supreme Lords of creation, existence and destructionare indeed shining , having become SESHI, the tutelary or guardian deity of all the deities and the Gods who accomplishes those 'three divine deeds', indeed. Therefore you, being the embodiment of agreeability, lovely venerable to be worshipped who has descended down from the very sky to the earth, are indeed the ultimate beauty.)

131. శా ॥వాయల్పాడు పురంబు నందు నవమిన్ వైదేహి కళ్యాణమున్
శ్రేయోదాయకపద్ధతిన్తలచి ఆశ్లేషోడు యుక్తంబుగా
ధీయుక్తుల్ జరిపించు టామె మహిమే, దేవేరినాగాఖ్యతా

రా యుద్ధంబున శత్రునాసఫలమే రామాయణోద్దేశమౌ !

(భావార్థం :-చైత్రమాసమున వసంతఋతువును పురస్కరించుకొని జరుగు శ్రీరామ జన్మమహోత్సవము తదుపరి నవమీ వివాహమహోత్సవము మొ॥న వన్నియు శ్రీరాముని జన్మ నక్షత్రమును  నాధరముగాగొని జరిపింప బడుచున్నవి. చిత్తూరుజిల్లా వాయల్పాడు పురమున మాత్రము సీతాకళ్యాణము ఆమె జన్మ నక్షత్రమైన ఆశ్లేషానక్షత్రమును పురస్కరించుకొని జరుపుచున్నారు. ఆనాడు నవమీ తిథి ఉండదు. శ్రీరాముని నక్షత్రము పునర్వసు కనుక-పుష్యమీ,తరువాత ఆశ్లేష నక్షత్రము గనుక దశమీ పోయి ఏకాదశీ తిథి రావచ్చును. కానీ వైదేహీ కళ్యాణము ప్రధానము కాబట్టి అలా జరుగుచున్నది.ఆశ్లేషా నక్షత్రము సర్వప్రధానమైనది.సీతాదేవి బడుపడగల నాగదేవత-అని అందరికీ తెలిసినదే.అనగా చండీ దేవత!)

(**Meanig** :-The auspicious ceremony of Lord SHREE RAMA'S birthday and His subsequent 'grand wedding day etc., are celebrated wholly depending on His birth-sign (a constellation out of 20 lunar mansions) that is in the month of CHAITRA (the first month as per the Hindu year) in accordance with the season of spring. But in the village VAAYALPADU, in CHITTOOR district, the wedding ceremony of SITA DEVI is celebrated as per Her birth sign AASLESHA (the ninth lunar mansion, containing five stars). That day being NAVAMI TITHI (the ninth lunar day either of the light or dark fortnight), doesn't exist. Because SHREE RAMA'S TITHI, being PUNARVASU (the seventh of the lunar mansions) and then it being AASLESHA (the ninth lunar mansion), having DASAMI (the tenth lunar day reckoned from new or full moon) gone, EKADASI (the eleventh day of each lunar fortnight may come. But the wedding of VAIDEHI (an epithet of SITHA DEVI), is important and main, it

**is celebrated thus. The AASLESHA (the ninth lunar mansion, containing five stars) is very principal for all. It is known to everyone that SITA DEVI is five-hooded serpent deity (with reference to VIBHEESHANA IN THE RAMAYAN) and it does mean that the deity CHANDEE.)**

**132.** ఉ ॥తూరుపు ప్రొద్దునన్ దివిని తోచెను నెరనిరేకలెన్నియో

ఆరుణి బింబజాతములు–ఆమెయి పైగెకప్రాకసాగుచున్ !

పారుచు కేరుచున్ నచట బారులు పుల్గులు పావురమ్ములున్

సారస సంఘముల్ సరసి చయ్యన విచ్చుచు దేవి సేవలో–

(భావార్థం :–ఓ చాముండేశ్వరీ దేవీ ! ఉష:కాలమున వేల్కొని చూడగా–తూరుపు దిక్కున ఎర్రని రేఖలు అసంఖ్యాకముగా– అరుణి బింబజాతములు–ఆకసమున ఉదయించి క్రమక్రమముగా పైకెగప్రాకసాగెను.కిలకిలారావములతో పులుగులు ఎగురుచూ నలుదెసల కలయదిరుగుచున్నవి.కొలనులోని తామరలు రేకులు విచ్చుచూ వికసించుచు దేవీపూజకు సిద్ధమగుచున్నవి! ప్రకృతి అంతయూ నీ సేవకై ఉపక్రమించుచున్నది కదా ! )

**(Meanig :-OH! CHAMUNDESWARI DEVI! At dawn, having woken up alerted, when we behold in the direction of the east, innumerous dark-red gleams of reflecting rays of the very rising-Sun, having dawned in the sky, gradually in due succession, goes on creeping up. The birds while twittering are flying all around and moving all at once. And at the very time the buds of the lotus in the lake are getting ready themselves, unfolding their very tender petals one after one by blooming and blossoming themselves for the worship of Devi. Entire the nature for your very worshipping-service is com-**

mencing to proceed on.)

133.సీ ॥ మాధుర్యమూర్తివై మధువును పంచంగ
శ్రీచండి వైనావు చిలుకులందు,
సృష్టిలో దాగున్న శ్రీతత్త్వమంతయు
నీలోన పూర్తిగా నింపుకొందు,
సృష్టిస్థితిలయలు త్రిమూరి కార్యాలు
చేయంగ నీవయు శేషివౌదు,
సౌందర్య మంతయు చిందింతు వీవమ్మ
సీతమ్మవై మాదు చిత్తమందు

తే.గీ ॥ ఏడురంగులు దీపించు నింద్రధనువు
తెలుపునుండియె సుషమించు తేటపడుచు,
జగతి నీ నుండి జనియించి జాగృతమగు
లయము నొందును నీలోన లయపువేళ !

(భావార్థం :-ఓ త్రిశక్తి స్వరూపిణీ ! నీ దివ్యలీలలనంతములు తల్లీ! మధువును పంచగా చిటుకులగ్రామ సమీపాన మాధుర్యమూర్తిగా చాముండేశ్వరిగా ప్రతిష్ఠితవైనావు. శ్రీతత్త్వమును సంపూర్ణముగా బోధించుటకు నీలో నింపుకొన్న ఉపనిషత్తత్త్వమును ప్రకృతిలో ప్రసరింపజేయుచున్నావు. సౌందర్యమనగా నేమియో అవగాహన మొనరింపజేయుటకు సీతాదేవివై లంకలో అశోకవనమున ప్రవాసమొనరింప ప్రస్ఫుటము చేసినావు.ఏడురంగులు తెలుపునుండియే వివర్ణితములగునని ఇంద్రధనువువై ఆకసమున దీపింతువు తల్లీ ! జగతి నీనుండి ఉద్భవించి జాగృతమగును. జీవజగతికి ప్రస్ఫుటమగును. ప్రలయవేళ నీలోన లయమునొందును.నిను తెలియుట కైవల్యమొందుటయే-)

(Meanig :-Oh! The embodiment of the three-potencies! Your pious-sports are infinite oh! Divine Mother! When nectar is offered, you by yourself are eternally estab-

**lished in the proximity of the village CHITUKULA as CHAMUNDESWARI, the embodiment of the sacred-sweetness. In order to teach completely with the true perfection, the ens or philosophy of the sacred seed-syllable 'SHREE', your are spreading the quest of truth, the ideology of UPANISHADS (a philosophical disquisition attached to the VEDAS) that's filled already in you. In order to make us comprehended what's meant by beautifulness, you, having become SITA DEVI made it serene and obvious by remaining at ASOKA VANA (a garden) in Lanka, being abducted and alone, away from home under destined plight of fate. (Thus you have proved that the originality of beauty and elegance never be faded out under any circumstances irrespective of plight, place and time). You shine to be evident, having become 'The Bow of INDHRA' (rainbow) to let it be perceived that all the seven colors are derived or streamed out from the white color only. Divine Mother, the universe having originated from very you, gets attentive wakefulness and be evident to all the living beings and at the time of the great destruction dissolves in you. Perceiving you only is indeed achieving the Beatitude.)**

**134.సీ ॥ సాహిత్య సంపదల్ సమముగా సంధించి**
**మాధుర్యరుచులన్ని మదినిదెలిపి,**
**సంగీత సురభులన్ చక్కగా పూరించి**
**గమకముల్ నిండుగా గళము నుంచి,**
**మంత్రార్థ పాఠముల్ మదిలోన వివరించి**
**ఏకాగ్రధ్యానంబు నెంతొ పెంచి,**

నిష్ఠలో నీరూపు నిండుగా చూపించి

ఆనంద పారవశ్యంబు నింపి,

తే.గీ ॥ కర్మ జీవితంబనుభవకమ్ముగాన

గమ్యమార్గాన గతమును ఖతముచేసి,

భువిని నీకన్న వేరొక్క దేవి నన్ను

నుద్ధరింప దటంచును నుడివినావు !

(భావార్థం :-ఓ కైవల్యప్రదాయనీ ! నా జీవన గమనములో ఎన్నిమలుపులో,ఎత్తువంతలో నాకు స్పష్టముగా చూపించినావు గదా తల్లీ! సాహిత్యసంపదను నింపి మాధుర్యరుచులను మనసునకు సుబోధకము చేసినావు.సంగీత సౌరభ్యమును గమకపూర్వకముగా గళము నిండా నింపినావు-మంత్రార్థపాఠములను ధ్యానములో వివరించి సమాధిస్థితిని కలిగించినావు. నిష్ఠలో నీ రూపునిండుగా చూపించి "ఆనందో బ్రహ్మేతివ్యజానాత్" అనుబ్రహ్మ సూత్రమును వ్యాఖ్యానించినావు. సంచితకర్మను ప్రారబ్ధముతో సమయింపజేసి-ప్రారబ్ధమును సార్థకమొనరింపజేసి-ఆగామికి రంగమొనరించినావు.నన్నుద్ధరించు దేవి నీవు దప్ప మరోశక్తి లేదని నా హృదయమున తేటతెల్లముచేసి చాటినావు. ముమ్మాటికి నిజముదేవీ నిజము! )

(Meanig :-Oh! The bestower of the Beatitude! Oh! Divine Mother, you have indeed showed me quite obviously how many turnings, ups and downs in the journey of my very life. You, having filled the literary-wealth, kindly have persuaded to my heart, all the sweet flavors. You have filled my voice (throat) the fragrance of the divine music to the tune of symphonious-notes. Having taught me in my meditation the lessons of chants and of their profound meanings, you have begotten me the state of SAMAADHI (deep meditation with devout abstraction).

Having showed your eternal appearance entirely in my 'devoted-austerity', you have explained AANANDHO BRAHMETHI VYJANAATH (perceive the ens of Lord BRAHMA, the heavenly bliss with sheer un-worldliness), called BRAHMA SUTRA. Having leveled or equalized both the SANCHITHA KARMA (the sins contracted in the former births) with PRAARABDHA (the consequences of original sins) -- having made PRAARABDHA, a meaningful and effectual - you have framed or prepared the stage or platform for my AAGAAMI (future). Kindly uphold me Devi. You have as clearly as serene, made it apparent and evinced to my very heart that no other potency or divine energy does exist other than you. Indeed it's true and it is only the absolute truth Devi!)

135. తే.గీ ॥ పీఠికా పురానవెలసి పెద్దగుడిని
చేరి భక్తుల పూజలు స్వీకరించి,
పేర్మి కోర్కెలు దీర్చుచు ప్రేమమీర
చెలగు శ్రీ పురుహూ తికన్ దలతు హృదిని ॥

(భావార్థం :-ఓ పురుహూతికా దేవీ- సతీదేవి శరీరమునుండి విడివడి ఆమె పీఠభాగము పడినందువల్ల,అక్కడ దేవీపీఠ ప్రతిష్ఠ జరిగినది గనుక-పీఠికాపురమునియు-క్రమక్రమముగా పిఠాపురమనియు పేరొందినది.పురుహూతునిచే పూజింపబడి-పురుహూతికాదేవి యని ప్రసిద్ధి నందినది.ఆ ప్రదేశమున నెలకొన్న నిన్ను నా హృదయమునందు నిత్యము ధ్యానింతును.)

(Meanig :-OH! PURUHUTHIKA DEVI! Having been separated from the very body of SATHI DEVI (consort of Lord SHIVA) 'her rear' having fallen down, there DEVI'S establishment of her permanent seat has been

**dedicated. Therefore it is called 'PEETIKHA PURAM' and it has got the name in order or in due course as PITA PURAM, being worshipped by PURUHUTA, the king -DEVI has been renowned as PURUHUTI DEVI, I incessantly go on adoring oh Devi in my very heart, who has appeared herself in that very holy premises.)**

**- స్వస్తి -**

**"MAY IT BE WELL WITH YOU!"**

రచన

శ్రీహరి ప్లావుళ్ళి

సీసము: నీ శ్వాస పరిమళమ్ మా శ్వాసగా మార,
నీ శోభ నిరతమై నింగి నింపె !
పులకింప నీప్రభల్ పులకించె పుడమంత !
నీ కీర్తి కెరటాలు నింగికెగిసె !
నీ దీప్తి జీవమై నిత్యమున్ దీపింప
జీవరాశి నడుపు జీవమాయె !
నీదు లాస్యపుధృతి నిజచేతనమ్మొచు
సర్వభూతములకు సత్తువాయె !

ఆ.వె: తల్లి !చిటుకులాంబ ! ధన్యతేజోరాశి !
దయను జూపవమ్మ తల్లిగావ !
ఆశ్రితులము మేము ! ఆదుకో చల్లగా !
ఆదిశక్తి ! మమ్ము ఆర్తితోడ ! (1)

సీసము; గుణములు గుణములౌ ! గుణములు చిరునామ ?
గుణములన్నియు నీవె ! గుణపురాశి!
గుణములౌనె జనుల గుర్తింపు యుర్విసన్?
గుణముమించెడి భక్తి గొప్పగాదె?
గుణముఘోష మరచి గుర్తించి భక్తుని,
అక్కున జేర్చుకు నాదరమున,
ఆదుకొనుగదమ్మ అత్యంత కరుణతో
అన్నిలోకములకు అమ్మగాన !

ఆ.వె: నీవె సర్వసాక్షి ! నీవె సర్వశరణ్య !
నీవె శక్తి, యుక్తి ! నీవె భక్తి !
నీవె కరుణ,దయయు, నీవె నిత్యామృతమ్ !

నీవె జోగులాంబ ! నిత్యదీప్తి !　　(2)

సీసము:　భీకరాకారంపు భీషణాహార్యంబు
　　రౌద్రాది రావమ్ము, రాశి మిగుల,
గానంగలేనమ్మ గౌరవమ్మా నీకు
　　ఒప్పునే చాముండీ ! చెప్పుమమ్మ?
చల్లని తల్లివే! సౌహార్ధమూర్తివే !
　　లావణ్యరూపివై లలితవాచు,
శిష్టులన్ పాలింప శేషిగా, పూర్ణగా
　　గాన్పించు గదమ్మ గర్వ పడుదు!　　(3)

సీసము:　భుజపంక్తి జూడంగ భువనమ్ము నిండుగా
　　పదునెన్మిది, నిజము, పరుచుకొనగ,
అస్త్రశస్త్రములన్ని ఆనరాగానిల్వ
　　భీకరాకారమ్ము భీతిగొలిపె!
ఔలనే, గానంగ,యేలనే నీ రూపు
　　సాక్షాత్కరించుమా సాత్త్వికమున!
భయమున మ్రొక్కంగ భయమేల తొలుగునే
　　అభయమీయము తల్లి! అఖిలవాచు!　　(4)

సీసము:　నినుగాంచి నివ్వెరన్, నే విస్తుపోతినే,
　　నిలువెల్ల పొంగంగ నీదు భక్తి!
నీ రూపలావణ్య నేపథ్య రాశినన్
　　నను నేను మరచితి నవ్యరీతి!
తల్లి చాముండివై దరహాసచంద్రికల్
　　వెదజల్ల యొడలెల్ల వేడిమిగిరె !
వింతగాదే, నాకు, వినయమున్దెల్పుదు
　　నీదు మూర్తి నిజము నిత్య కాంతి!　　(5)

సీసము: ఆనందనందినీ ! ఆహ్లాదరూపిణీ !
ఆప్యాయతాప్రదా! అగ్రగణ్య!
అపరదుర్గా! వరా! అపరంజిరూపిణీ!
అఖిల సాక్షీభూత ! అవని వంద్య !
శ్రీచక్రవాసినీ ! శ్రీనిత్యవాసినీ !
శ్రీవరాశక్తిభా ! శ్రితవరాళి !
అన్యధా శరణమ్ము ఆదుకోగదవమ్మ!
అల్పజీవిని గానె, నాదరమున? (6)

సీసము: గురువు శేషుండౌను ! గురువు శక్తయునౌను !
గురువు సర్వస్వంబు ! గురువు నిజము !
గురువు కాంతిపథము ! గురువు పథనిదేష్ట !
గురువు గాదె పుడమి గోప్యశక్తి !
వేంకన్నశాస్త్రిగా వేనోళ్ళ కీర్తిత
మాన్య మాధవపెద్ది మాన్య గురువు
అట్టి గురువు నిటన్, నాశింపకే బడయు
ఎట్టి సుకృతులెట దట్టినానొ ?
పూర్వజన్మము నందు పుణ్యమ్ము సేయగన్
దొరికెనేమో యిట్టి దొడ్డగురువు!
స్వార్ధ రహితహిత! సాక్షాత్తు పరమాత్మ !
సుతుని వోలె దలచి సూక్ష్మమిడెను!
మరుజన్మమున్నచో, మన్నించి వరమిచ్చి,
గురువు సుతునిగ నను గూడనిమ్ము,
నీదు సేవ తోడ, నిజముగా గురునికి
సేవజేయగలుగు చేవనొసిగి ! (7)

సీసము: స్ఫురణ ధారణ సిరి స్ఫుటముగా నిడుచునే
తీర్చిదిద్ది
అపరదుర్గా! వరా! అపరంజిరూపిణీ!
అఖిల సాక్షీభూత ! అవని వంద్య !
శ్రీచక్రవాసినీ ! శ్రీనిత్యవాసినీ !
శ్రీపరాశక్తిభా ! శ్రితవరాళి !
అన్యధా శరణమ్ము ఆదుకోగదవమ్మ!
అల్పజీవిని గానె, నాదరమున? (6)